# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 69 సంచిక 33
19-8-1988
నెల్లూరు
శుక్రవారం
14 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# శ్రీనివాసులురెడ్డి వేరేదారి వెతుక్కోవల్సివస్తుందా?

(హైదరాబాదు వృత్తాంతం)

మాజీమంత్రి, శివయ్యసేన గౌరవాధ్యక్షుడు శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కాంగ్రెస్ ప్రవేశం ఎప్పటికప్పుడు వాయిదా పడుతూనే వస్తున్నది. ఈ విషయంలో శ్రీనివాసులురెడ్డి ఎంత తొందర పడుతున్నారో, కాంగ్రెస్ అధిష్ఠానవర్గం అంత ఆలస్యంచేస్తున్నది. ఆయన్ను పార్టీలో చేర్చుకోవడంఖాయం అంటూనే రేపుమాపు అని వాయిదాలువేస్తూ, ఆలస్యానికి సరైన వివరణలేవీ ఇవ్వకుండా నెలల పర్యంతం త్రిశంకు స్వర్గంలో పెడ్తున్నారు పాపం.

జగన్నాథ పహాడియా సలహాపై ఆ రాష్ట్ర పిసిసి అధ్యక్షుడు శ్రీ జలగం వెంగళరావును కలుసుకోగానే తన ప్రవేశ ముహూర్తం నిర్ణయమై పోతుందని శ్రీనివాసులురెడ్డి భావించారు. అదే విషయం [illegible]దే కాకుండా, నెల్లూరువంటి జిల్లా కేంద్రాలలోకూడా పత్రికలవారికి ప్రకటించారు. అయితే వెంగళరావును కలుసుకోగానే ఆయన ఉత్సాహం నీరుగారిపోయింది. తననెంతో ఆదరంతో, అభిమానంతో స్వాగతించి హడావుడి చేస్తాడనుకున్న వెంగళరావు చాలా క్యాజువల్‌గా, నిత్యం తనను కలుసుకోవడానికి వచ్చే వందలాది కాంగ్రెస్ వాదులలో ఒకడుగా మాత్రమే ఆయన్ను పరిగణించారు. ఇది ఆయన్ను హతాశుణ్ణి చేసింది.

> కాంగ్రెస్ ప్రవేశం నిరవధికంగా వాయిదా పడుతుండడంతో ప్రత్యామ్నాయానికి ఆలోచన జరుగుతూందా?

ఇంకొక ప్రక్క అసలు శ్రీనివాసులురెడ్డి తెలుగుదేశం వదిలిపెట్టే సమయంలో తెరవెనుక చేరి వెన్నుతట్టి ప్రోత్సహించిన కేంద్ర మంత్రి శ్రీ శివశంకర్ కూడా ఇప్పుడు పట్టీపట్టనట్లు వ్యవహరిస్తున్నారు. రాయబారాలు నడిపిన ఎందుకు గంగాధరం అప్పట్లో శివశంకర్‌కు అత్యంతసన్నిహితుడు. అయితే శివశంకర్ ఇప్పుడు గంగాధరాన్ని దూరంగా పెట్టినట్లు తెలుస్తూంది. నిజానికి శివశంకర్ హామీ మేరకే గంగాధరం శ్రీనివాసులురెడ్డిని ప్రేరేపించి పార్టీనుండి బయటపడేటట్లు చేశారని చెప్పేవారు. అటువంటి ఆధారం కోల్పోవడంతో ఇప్పుడు గంగాధర్ ఢిల్లీలో మకాంపెట్టి, వెంగళరావుకు సన్నిహితం కావడానికి, కొత్త అండను వెతుక్కోవడానికి గట్టిప్రయత్నం చేస్తున్నాడు.

తన బంధువులకు అమెరికా వీసా సంపాదించేందుకు తాను ఢిల్లీలో వుంటున్నానని బుకాయిస్తున్నప్పటికీ, వెంగళరావు సన్నిహితులైన పార్లమెంట్ సభ్యుల ఇళ్ళవాకిట పడిగాపులు కాయడానికే ఆయనకు సమయం సరిపోతున్నదని చెప్తున్నారు. అతికష్టంమీద ద్రోణంరాజు సత్యనారాయణ చెలిమి సంపాదించ గల్గారట ఆయన.

నిజానికి వెంగళరావు శివయ్య ప్రవేశానికి విముఖుడేమీకాదు. అయితే అది కేవలం

-కొరవ 6వ పేజీలో

## జియా దుర్మరణం



పాకిస్థాన్ అధ్యక్షుడు జనరల్ జియాఉల్‌హక్ 17 తేది సాయంత్రం లాహోర్ సమీపంలో విమానం కూలిపోయి దుర్మరణం పాలయ్యారు. ఆయనతోటి మిలిటరీ వున్నతాధికారులు, పాకిస్థాన్‌లో అమెరికా రాయబారికూడా వుండినారు. విమానంలో వుండిన మొత్తం 30 మందీ చనిపోయారు. ఇది ప్రమాదవశాత్తు జరిగిందికాదని, జియా వ్యతిరేకులే పకడ్బందీగా పథకంవేసి విమానం కూల్చివేశారన్న వదంతులు ప్రపంచమంతా దట్టంగా వ్యాపించివున్నాయి.

జియా వయస్సు 64. ఆయనకు భార్య, ఐదుగురు పిల్లలు వున్నారు.

తనను సర్వసైన్యాధ్యక్షుణ్ణి చేసిన ప్రధాని భుట్టోను కూలదోసి, తర్వాత ఆయన్ను వురితీయించి, జియా పదకొండేళ్ళుగా నియంతగా పాకిస్థాన్‌ను పరిపాలించారు.

మనమీద కత్తికట్టిన జియా మరణం మనకు సంతోషదాయకమేమీ కాదు. పాకిస్థాన్ మరో నియంత చేతబడకుండా ప్రజాస్వామ్యం చోటు చేసుకోగలిగితే జియా మృతి ఆ దేశంలోను, భారత-పాక్ సంబంధాలలోను నూతనాధ్యాయానికి నాంది పలికినట్లవుతుంది.

# జిల్లాలో తెలుగుదేశం పార్టీ తలలేని మొండెంగా తయారైంది

తెలుగుదేశం అగ్రనాయకత్వం నెల్లూరు జిల్లాను రాజకీయంగా అనాథను చేసినట్లు కన్పిస్తుంది. ఎ. సి. సుబ్బారెడ్డి హయాం నుంచి, అంతకు క్రితం కూడా రాష్ట్ర రాజకీయాలపై నెల్లూరుజిల్లా ప్రభావం ఎప్పుడూ వుండేది. లోక్‌సభ్ల పంపిణీ, క్యాబినెట్ నియామకం వంటి సందర్భాలలో నెల్లూరు, రాష్ట్ర నాయకులకు ఎప్పుడూ తలనొప్పిని తెచ్చిపెట్టేది. నెల్లూరు ప్రాతినిధ్యం లేని మంత్రివర్గాలు దాదాపు లేవనే చెప్పాలి. మంత్రిత్వం విషయంలో కూడా పనది ఎప్పుడూ పేచీయే! ఏ ముఖ్యమంత్రి అయినా నెల్లూరు పర్యటనకువస్తే, అయన పులికి చలికాలం వచ్చినట్లు భావించిన సందర్భాలూ వున్నాయి. ఈ రెండుమూడు దశాబ్దాలలో మనజిల్లానాయకులు రాష్ట్రాన్ని అంతగా ప్రభావితం చేశారు అంతెందుకు. మన ఇరుగుపొరుగున వున్న చిత్తూరు, ఒంగోలు నాయకులు. వారేపార్టీవారైనా సరే. ఎవరో మన జిల్లావాసులకు సరిగా తెలియదు; కానీ నెల్లూరుజిల్లా నాయకుల పేర్లు మాత్రం శ్రీకాకుళం జిల్లా వాసులకు కూడా సుపరిచితమే!

అటువంటి నెల్లూరును ఏడాది పైనుంచి తెలుగుదేశం అగ్రనాయకత్వం అనాథను చేసిపారేసింది; అనుకునేవారు లేకుండా పోయింది! నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి పదచ్యుతుడైన తర్వాత ఆ పార్టీకి జిల్లా స్థాయి నాయకుడంటూ లేకుండాపోయాడు. జిల్లాలోని ఐదుగురు తెలుగు ఎమ్మెల్యేల లోనూ మంత్రిత్వం అర్హత వున్నవాడు ఒక్కడూ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావుకు కన్పించినట్లులేదు. నిజానికి శ్రీనివాసులు రెడ్డి దిగగానే, జిల్లాలో పార్టీని పటిష్టపరచ డానికి ఎవరో ఒకరికి మంత్రిత్వం ఇవ్వడం ఖాయమనే అనుకున్నారు. ఆనం రామనారాయణరెడ్డినుంచి పత్తి మణెయ్య వరకూ, తమతమ అవకాశాలను గుణించు కుని, తమలోతాము ఊహల్లో తేలిపోయారు కొంతకాలం. కాని వారాలు గడిచిపోయి, నెలలు; నెలలు గడిచిపోయి సంవత్సరం దాటుతున్నా ఎన్టీఆర్ ఆ ఊసే ఎత్తటో లేదు సరికదా. అసలీ జిల్లాతో, జిల్లా ఎమ్మెల్యేలతో, జిల్లా పార్టీతో తనకేమీ అవసరం లేదన్న ధీమా కన్పిస్తున్నది ఆయనలో!

> అగ్రనాయకత్వం ఎవరినీ నమ్మడంలేదు, ఎవరికీ బాధ్యత అప్పగించలేదు. ఫలితంగా అందరికీ అందరూ నాయకులే- అందరూ అనుచరులే!

లేకుంటే ముద్రగడ పద్మనాభం రాజీనామాచేయగానే ఆ జిల్లాకు చెందిన హరి రామజోగయ్య, ఎనమల రామకృష్ణుడువంటి వారిని అక్కునచేర్చుకుని, వారు లేనిదే తానులేనట్లు ప్రవర్తిస్తున్న ఎన్టీఆర్, శ్రీనివాసులురెడ్డి రాష్ట్రమంతా ఎలుగెత్తి అరిచి తిరుగుతున్నా ఒక్క ఎమ్మెల్యేనీ పిల్చి, పలకరించలేదంటే ఏమనుకోవాలి?

మంత్రిత్వం సంగతి సరే-కనీసం జిల్లాలో అనేకానేక పదవులలోవున్న ఇతరులు, వేలసంఖ్యలోని పార్టీసభ్యులకు నాయకుడెవరో, వారెవరిమాట వినాలో, అవసరం వచ్చినపుడు ఎవరి ఆశ్రయం పొందాలో కూడా చెప్పకుండా గాలికి వదిలేశారు.

మొదట జిల్లా ప్రజాపరిషత్ ఛైర్మన్ శ్రీ దేగా నారసింహారెడ్డికి అధికారాలు దఖలుచేయవచ్చునని భావించారు. అయితే అప్పట్లో అయనకు, శ్రీనివాసులురెడ్డికి మధ్య రహస్య సంబంధాలు కొనసాగు తున్నాయన్న సందేహాలు తలెత్తడంతో ఆఆలోచన మానుకున్నట్లున్నారు. శ్రీ బెజవాడ పాపిరెడ్డికి పెద్దరికం కట్టబెట్టవచ్చు ననుకున్నారు. కానీ ఆయనకు ఒకరికింద పనిచేయడం, ఒకరిచేత పనిచేయించు కోవడం రెండూతెలియవు. ముఖ్యమంత్రిని, ఆయన అల్లుడ్ని మెప్పించే ప్రయత్నం చేయకపోవడంతో ఆయనకు 'నాయకత్వం పీఠ' వదలిపోయింది. తమ్ముడు పోతే అధికారం అన్నకైన తనకు ఇచ్చితీరుతా రని నల్లపరెడ్డి చంద్రశేఖర రెడ్డిగారు చకోర పక్షిలాగా ఎదురుచూశారు. అందుకోసమే తమ్ముడ్ని అనరాని మాటలుకూడా అన్నారు. కానీ, మామా అల్లుళ్ళిద్దరూ అయన్ను దగ్గరకు పిల్చినట్లేపిల్చి, ఫుట్ బాల్ తన్నినట్లు తన్నిపారేశారు. చిట్టేడు బసవరామతారకంకాలనీలో ముక్కుమూసు కొని తపస్సుచేసుకోవల్సినపరిస్థితి పాపం, ఆయనది!

ఆనంవారి సంగతి చెప్పిందేకదా! వారికి జిల్లామీద పెత్తనం కాదుకదా, వారి స్వంత గ్రామంపై ఆధిపత్యం కావాలన్నా -ఒప్పు కోడుగాక ఒప్పుకోడు మామా అల్లుళ్ళు; ఎమ్మెల్యే అయిన కాతమ్మంచి ఈరోజుదాకా రామనారాయణరెడ్డి మూడున్నర సంవత్స రాల పాటు మనస్సు చంపుకొని, నోరు కట్టేసుకుని, ఆత్మీయులు ఛీ ఛా అన్నా సహించి, ఆత్మగౌరవం అంటే ఏమిటో తెలియనట్లు నడిచి 'రాముడు మంచి బాలుడు' తరహాలో వ్యవహరించినా ఎన్టీ ఆర్ మనసు కరగలేదు! కొత్తగా ఆనం వివేకానందరెడ్డికూడా తెలుగుదేశం సేవే తన జీవిత పరమావధి అన్నట్లు నడుం బిగించి పనిచేస్తున్నా, వ్యతిరేకులపై నోరు

-తరువాత 10వ పేజీలో















## పినాకినీ తీరం

### సంస్మరణ

17 తేదికి నెల్లూరుకు గర్వకారకుడైన జర్నలిస్టు జి. కె. రెడ్డి దివికేగి అప్పుడే సంవత్సరం అయిపోయింది. కాలం జరిగి పోవడమేగాని, తీవ్ర అస్వస్థతలో సైతం వారని పర్చస్పుతోవుండిన ఆయన సుందర ప్రసన్నవదనాన్ని నిన్న మొన్న చూసినట్లు, చిన్నని సన్నని ఆయన మృదుస్వరాన్ని విన్నట్లు, ఆయన చూపిన ఆప్యాయత ఆత్మీయతానుభూతులు చెక్కుచెదరకుండా వున్నట్లు నా స్మృతి పథంలో మెదలు చూసేవున్నాయి. నాకు ఆయనదివ్యదర్శన భాగ్యం మద్రాసులో చికిత్స పొందుతుం దిన సమయంలోనే! మనిషి మనమధ్య లేక పోవచ్చు; కాలం గతించిన మనిషిని మరుగు పరచవచ్చు; కాని గౌరవాభిమానాలుగల వ్యక్తుల మానసాలలో వారు, వారిస్మృతులు శాశ్వతంగా వుండిపోతాయి. జర్నలిస్టు లలో నాకు సంబంధించి కీర్తిశేషుడు జి.కె. రెడ్డిగారు అటువంటి వారు. 'టైమ్స్ అఫ్ ఇండియా' ఛీఫ్ రిపోర్టర్ హోదా వరకు ఎదిగిన స్వర్గీయ భైరవరసు హనుమంత రావుగారు మరొకరు.

జి. కె. రెడ్డి వ్యక్తిగా, పత్రికారచయితగా విలక్షణమైనవ్యక్తి. జి. కె. రెడ్డి జర్నలిజాన్ని చేపట్టడం విచిత్రమైన విషయం. వారి కుటుంబంలో, వారి బంధు వర్గంలో ఎవరూ అంతకుముందు జర్న లిజంలో లేరు. అటువంటిది జి. కె. రెడ్డి గారికి పత్రికావ్యాసంగంమీద అభిరుచి ఎందుకు కలిగింది? ఎట్లాకలిగింది? నలభై ఏళ్ళ పరిచయంలో అయన్ను నేనెప్పుడూ ఈ విషయం అడగలేదు; ఎందుకు అడగ లేకపోయానో ఇప్పుడనుకుంటే నా నుంచ మతికి నాకే ఆశ్చర్యం వేస్తుంది. చదువుకొంటూ చదువుకొంటూ ఇంట్లో చెప్ప కుండా బొంబయి పోయేటప్పుడే అయనకు ఆ వృత్తిమీదదృష్టివుండినదో, లేక అక్కడ ఒక పాత్రికేయుని ఆశ్రయంవల్ల తన స్వభావానికి అభిరుచికి అది తగినరంగమని ఆయనజర్నలిజాన్నే చేపట్టి అందులోనే స్థిర పడ్డారో తెలియదు. ఒక్కవిషయంమాత్రం ఊహించవచ్చు- ధనార్జన ఆయనఆశయం కాదు, లక్ష్యమూకాదు!

జర్నలిజంలో సైతం మొదటిరోజుల్లో వివాదాస్పదుడే, సంచలనాత్మకుడే. శ్రీనగర్ నుండి 'కాశ్మీర్ టైమ్స్' ఇంగ్లీషు వారపత్రికకు సంపాదకత్వం వహించి నప్పుడు ఆయన కాశ్మీర్‌సింహం అబ్దుల్లాకు వ్యతిరేకం; కాశ్మీర్ రాజా హరిసింగ్, ప్రధాని రామచంద్రకాక్‌లకు అనుకూలం. అవిధంగా ఆయన 1947 అగస్టు 15 కు ముందు కాశ్మీర్‌లో వివాదాస్పదుడైన జర్నలిస్టు. దేశవిభజన తర్వాత ఆజాద్ కాశ్మీర్‌నుండి తప్పించుకొని కరాచీ మీదుగా బొంబయిచేరి తన సాహసయాత్రలను గురించిన వ్యాసాలతో 'బ్లిట్జ్' ద్వారా సంచలనం సృష్టించారు. జి. కె. రెడ్డి పేరు దేశవ్యాప్తంగా తెలిసింది అప్పుడే!

తర్వాత ఆయన మొదట "టైమ్స్ ఆఫ్ ఇండియా" లో చేరారు; తర్వాత "హిందూ". టైమ్స్ఆఫ్ఇండియా అయన్ను జర్నలిస్టుగా అంతర్జాతీయంగా పరిచయం చేసింది; పెకింగ్, లండన్, న్యూయార్క్ వగైరా నగరాలలో ఆయన ఆ పత్రిక విలేఖరిగా పనిచేశారు. లండన్‌లో వుండగా ఆయన వివాహితుడైనారు. "హిందూ" అనుబంధం జి. కె. రెడ్డి పాత్రికేయ జీవితంలో సువర్ణ ఘట్టం అన వచ్చు. ఆ పత్రిక ద్వారా ఆయన ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో విఖ్యాతులైనారు; ఆయనవల్ల 'హిందూ' కూ ప్రాచుర్యం లభించింది. జి. కె. రెడ్డి స్వభా వంలోని విశేషం, తాను ఏ పత్రికలో పని చేస్తాడో ఆ పత్రిక తనదనుకుంటారు, దానితో తాదాత్మ్యం చెందిపోతారు, మేనేజ్ మెంటు గౌరవ విశ్వాసాలను అత్యంతంగా

—తరువాత 8 వ పేజీలో

## నిర్యాణము - సంతాపసభ



నా తండ్రి

వేమన పాపయ్యనాయుడుగారు

కరటంపాడు.

12-8-88 తేది శుక్రవారం స్వర్గస్తులైరి. వారి జ్ఞాపకార్థము 22-8-88 తేది సోమవారం ఉదయం 9-30 గంIIకు కరటంపాడులోని మా స్వగృహమందు పూజా కార్యక్రమములు జరుగును. బంధుమిత్రులు, అభిమానులు తెలియ గోరుచాము.

వేమన రామచంద్రరావు

మరియు

కుటుంబసభ్యులు

మా మాజీసర్పంచ్

వేమన పాపయ్యనాయుడు

24 సంవత్సరములు సర్పంచ్‌గా గ్రామాభివృద్ధినిసాధించి-సాంఘిక ఆర్థిక, రాజకీయరంగాలలో అందరికీ ఆప్తుడుగా, అందరిమన్ననలు పొంది 12-8-88 తేది శుక్రవారం మమ్ములను, మా గ్రామాన్ని వీడి స్వర్గస్తులైన సందర్భమున, వారి ఆత్మశాంతికొరకు 22-8-88 తేది ఉదయం 11 గంIIకు ఆత్మకూరు శాసనసభ్యులు డాII బి. సుందర రామిరెడ్డిగారి అధ్యక్షతన కరటం పాడు గ్రామమునందు సంతాప సమావేశము జరుపబడును. పాపయ్యనాయుడుగారి అభిమానులు, అనుచరులు, గ్రామప్రజలు పాల్గొనకోరుచాము.

జ్యోతి గురవయ్య

సర్పంచ్

గార్లపాటి వేణుగోపాల నాయుడు

ఉపసర్పంచ్

మరియు సభ్యులు.

# జమీన్‌రైతు

## దేశానికి గౌరవమా?

పాకిస్థాన్ అవతరణ దినోత్సవ సందర్భంగా- ఆగస్టు 14 తేది- భారత మాజీప్రధాని శ్రీ మొరార్జీదేశాయ్‌ను "నిషాన్-ఇ-పాకిస్థాన్" అనే బిరుదుతో గౌరవించింది. మన "భారతరత్న" బిరుదుతో సమానమైంది ఆ పురస్కారం. అంటే మొరార్జీని ప్రెసిడెంటు జియా పాకిస్థాన్ ప్రతీకగా- రత్నంగా- భావిస్తున్నారన్నమాట. పాకిస్థాన్‌లో అంతకంటే పెద్దబిరుదు మరొకటిలేదు.

మొరార్జీకి ఈ బిరుదును పాకిస్థాన్ ఎందుకు ప్రదానం చేయదలచిందంటే- ఆయన ప్రధానిగావుండిన జనతా ప్రభుత్వ హయాంలో భారత పాకిస్థాన్ సంబంధాలు వున్నంత సుహృద్భావంగా మరెప్పుడూ లేవట. అందుకు గుర్తుగా ఈ బిరుదప్రదానం జరుగుతున్నది.

సిక్కు వుగ్రవాదులకు శిక్షణమొదలు ధన ఆయుధ తదితర సకల సహాయాలూ అందజేస్తూ, పంజాబులో కల్లోలం సృష్టిస్తూ, అన్నివిధాలుగా మనదేశ వినాశనానికి విశ్వప్రయత్నం చేస్తున్న పాకిస్థాన్ బిరుదును ఈసమయంలో స్వీకరించడం వుచితంకాదని అఖిలభారత కాంగ్రెస్ సంఘం ప్రకటించింది. రాజ్యాంగంలోని 18 (2) ఆర్టికల్‌ను అనుసరించి విదేశీబిరుదాన్ని భారతీయులెవరూ స్వీకరించగూడదనే వాస్తవాన్నికూడా కాంగ్రెస్‌సంఘం గుర్తుచేసింది. అంతేకాదు, పదేళ్ళక్రితం జనతాప్రభుత్వానికి ప్రధానిత్వం వహించిన మొరార్జీని, ఇన్నేళ్ళు వూరకుండి ఇప్పుడు గౌరవింపబూనడంలో ఏదో దురుద్దేశ్యం వున్నదని కాంగ్రెస్ పేర్కొంటున్నది. అందువల్ల ఆ బిరుదాన్ని తిరస్కరించవలసిందిగా ఆయన్ను కోరుతున్నది.

కాని మొరార్జీదేశాయ్ మాత్రం ఆ బిరుదు వ్యక్తిగతంగా తనకుగాక దేశానికి గౌరవప్రదమైనదని పేర్కొంటున్నారు. అంటే పాకిస్థాన్ పురస్కారానికి ఆయన సమ్మతిస్తున్నాడనే అనుకోవాలి; దాన్ని గొప్ప గౌరవంగా భావిస్తున్నాడనే అనుకోవాలి. మొరార్జీ వుత్తమ దేశభక్తుడు; త్యాగశీలుడు; నీతి నిజాయితీలకు ప్రతీక; వ్యక్తిత్వానికి, స్వతంత్రపోరాటకు ప్రసిద్ధుడు. ఆ విషయాల్లో ఆయనంటే ప్రజలకు అత్యంత గౌరవభావం. కాని మొండితనానికి, మూర్ఖభావాలకు కూడా ఆయన మారుపేరు. అందువల్లనే ఆయన నాయకత్వం జనరంజకతకు సుదూరంలో వుంటుంది. పైగా ఇప్పుడు తొంభై రెండేళ్ళ వయోభారం, ఇంటినుండి కదలలేని అనారోగ్యం పైనబడ్డాయి. ఇటువంటి పరిస్థితుల్లో ఆయన తన నిర్ణయాన్ని మార్చుకుంటాడని, పాకిస్థాన్ ఏదో కుట్రభావంతో ఇచ్చిన బిరుదును తిరస్కరిస్తాడని ఆశించడం పొరపాటే అవుతుంది.

ఆయన జ్ఞానవృద్ధుడే అయివుంటే, మంచిచెడులను గూర్చి లోతుగా ఆలోచించే శక్తిని కోల్పోకుండావుంటే- పదేళ్ళనాటి సౌహార్దత ఈనాడు అకస్మాత్తుగా పాకిస్థాన్ నాయకులకు పెల్లుబికి వచ్చిందని ఎట్లా పొరపాటుపడతాడు? తనకున్న మంచిపేరును దేశంలో చిచ్చు పెట్టడానికి పాకిస్థాన్ వుపయోగించుకొంటున్నదని ఎట్లా తెలిసికోలేకుండా వుంటాడు? జనతా సంఘటన తర్వాత తిరుగా అటువంటి ప్రతిపక్షాల సమైక్యత ఏర్పడుతున్న సమయాన్ని పాకిస్థాన్ ఈ బిరుద ప్రదానానికి వుపయోగించుకుంటున్నదనే సూక్ష్మాన్ని ఆయన ఎట్లా గ్రహించలేకుండాపోతాడు? దేశ శ్రేయస్సుకు, దేశప్రతిష్ఠకు ఆయన ప్రాధాన్యత ఇవ్వదలచుకుంటే, పక్కలో బల్లెంగావున్న పాకిస్థాన్ మెప్పుకు ఎట్లామోసపోతాడు?

మొరార్జీ రాజ్యాంగవిరుద్ధంగా వ్యవహరించే నాయకుడుకాదు; కాంగ్రెస్‌మీద గుడ్డిద్వేషంతో అనుచితంగా వ్యవహరించే వ్యక్తికూడా కాదు. అటువంటి గౌరవనీయుడు ఈ అవసానదశలో రాజ్యాంగ సూత్రాలకు తెలిసీ ప్రత్యక్ష విరుద్ధంగా వ్యవహరించబూనడం దురదృష్టకరమనే అనుకోవాలి. రాజ్యాంగ నిషేధం విషయమేకాదు; పాకిస్థాన్ సైనికపాలనలోవున్న ఒక నిరంకుశ రాజ్యం; పంజాబ్ మారణహోమానికి ఆజ్యం పోస్తున్న రాజ్యం; భారత ప్రజాస్వామ్యాన్ని నామరూపాలు లేకుండా చేయాలనే సామ్రాజ్యవాదదేశాల కార్యకలాపాలకు ఆశ్రయమిస్తున్న దేశం. అటువంటిశత్రురాజ్యంఇస్తున్నబిరుదును మొరార్జీదేశాయ్ వంటి వుత్తమ దేశభక్తుడు స్వీకరించడం అవమానకరంకాదా? అది దేశ విరుద్ధచర్యకాదా? ఇప్పుడు ఏ పార్టీకి చెందినా - కాంగ్రెస్ కురువృద్ధుడుగా పేర్కొనదగిన మొరార్జీ, పాకిస్థాన్ పురస్కారాన్ని తిరస్కరించి ఆదర్శవంతుడనే పేరును నిల్పుకోవాలని కోరుతున్నాము.

## జమీన్‌రైతు

19-8-1988

### నెల్లూరు ముచ్చట్లు

(విమర్శకుడు)

**33 సంవత్సరాలు శిక్ష**

12-13 తేదుల్లో వెంకటగిరిలో సమావేశమైన ఆంధ్ర కాంగ్రెసు కార్య సంఘంవారు నెల్లూరు మున్సిపాలిటీలో కాంగ్రెసు ఆజ్ఞలను ధిక్కరించిన ఎ. సి. రెడ్డి పార్టీ 11 మందికి నవరు 13 3 సంవత్సరముల వంతున 11 మందికి 33 సంవత్సరాలు కార్యవర్గం ఏ ఎన్నికల్లో పాల్గొనకూడదని శిక్ష విధించారు.

**బోర్డులు కలుపుతారు**

రెండు బోర్డులు ఏకంచేస్తారట అక్టోబరులో.

**రాజీనామా**

ఉత్తరబోర్డు మీటింగు 31 తేది జరుగుతుంది. గోవిందయ్య ఆనాడు రాజీనామా యిస్తాడు నిష్కర్షగా. వెంటనే వైస్ ప్రెసిడెంటు వెంచయ్య నాయుడుగారు ఇన్‌చార్జి ప్రెసిడెంటు అవుతారు. తర్వాత ఆయన ఎప్పుడు ప్రెసిడెంటు ఎలెక్షను జరుపుతాడో? ఇక కుక్కచింపిన విస్తరి కాకుండా చూడకోవాలె.

**గోపాలురెడ్డిగారిమీద డిసిప్లినరీ చర్య**

**ఇండియన్ ఎక్స్‌ప్రెస్ అబద్ధపు ప్రకటన**

గోపాలురెడ్డిగారు నెల్లూరు మునిసిపల్ అధ్యక్ష ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థికి పోటీగానిలిచినవ్యక్తికి సహాయపడ్డట్లు, అందుమీద పట్టాభిగారు రెడ్డిగారిమీద డిసిప్లినరిచర్య జరుపుకోదలచినట్లు, ఇందువిషయమై ఇదువరికి కొంత చర్చ జరిగినట్లు 17 తేది ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రకటింపబడింది శుద్ధఅబద్ధమని రెడ్డిగారును,

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

పట్టాభిగారును ప్రకటించిరి. ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌కు నెల్లూరు ట్రంకురోడ్డు వారెవరో వ్రాశారని యుక్తి చూపరు.

**ప్రధానిపై రివాల్వరు ప్రయోగం**

లక్నోలో ఈ మధ్య జరిగిన జమీందార్ల సభలో ఒక జమీందారు ఉపన్యసిస్తూ రైతాంగ చట్టమును కాంగ్రెసు మంత్రులు ప్యాసుచేస్తే తనవద్దనున్న రివాల్వరును ప్రధాన మంత్రి (ముఖ్యమంత్రి) గుండెవైపు కాలు చేస్తానని పలికినట్లు సంయుక్తరాష్ట్రశాసనసభలో ప్రధాని (ముఖ్యమంత్రి) చేతనే చెప్పబడెను

**టాకీ రీలు**

**ఫేమస్ ఫిలిం**

రామా ఫిలింయొక్క అభిమాన పుత్రికే ఫేమస్. ఫిలిం కొల్హాపూర్‌లో పి. పుల్లయ్యగారి ఆధ్వర్యాన శ్రీనివాస కల్యాణం జరుగుతున్నదంటారు. నెల్లూరు ఆక్టర్లను పూర్తిగా బహిష్కరించారని ట్రంకురోడ్డు వార్తలు. కొందరిని ఏరుకొని, కొందరిని తిరస్కరించే దానికంటే అందర్నీ బహిష్కరించడం మంచిదంటారు మా వీరనాయకుడు. పిఠాపురం ఆస్థానజ్యోస్యుల్ని పిలిపించి గ్రహదోషాది శాంతులుచేసి హోమాది సత్క్రియలాచరించి, దానధర్మాది కృత్యములొనర్చి సమారాధనాది కార్యములు నెరవేర్చి మా పందిపాటి సుబ్బరామరెడ్డిగారు పయనంగకుతున్నారు కొల్హాపుర దివాణానికి. ఎన్ని గ్రహశాంతులుచేసినా అగ్రిమెంట్లు వెనక్కు తిరిగి చూచుకుంటే సంపద పరాయివాడిచేతులలో అట్టు ఒక్కోకుండా-

**కృష్ణవిలాస్**

ఈ కంపెనీ ఇంకా నవమాసాల గర్భంలోనేవుంది. ఏ ముహూర్తాన ప్రసవిస్తుందో? పర్వతరెడ్డి చంద్రశేఖరరెడ్డి, శ్రీమాన్ పి. వి. కృష్ణయ్యగారు, రాములూరు శివరామయ్య పంతులు, తిక్కవరపు రామచంద్రారెడ్డిగారలున్నా, మరికొందరు ఈ ఫిలింపుత్రోదయానికి తపస్సుచేస్తున్న మృకండ మునులు.

## కొత్త టౌను బస్సులొచ్చినా పాతసమస్యలు తీర లేదు

టౌనులో కొత్తబస్సులు వచ్చాకన్నా మా కష్టాలు తీరుతాయనుకున్నాము గానీ అదిఅబద్ధమని రుజువైంది. కొత్తబస్సులు కూడా పాతవాటిమాదిరే రేసు గుర్రాల్లా పరిగెత్తడం, జనాన్ని కుక్కలబండిలో కుక్కినట్లు కుక్కడం, ఏ రూట్‌లో నంబే ఆ రూట్‌లో తిరగడం...అంతా పాతవాటి తంతే. పొదలకూడురోడ్లో వెళ్లాల్సిన 4,54 బస్సులు మెయిన్‌రోడ్లో పోతున్నాయి. 54 నంబరు బస్సు వుడ్‌బోర్డు ఆకాశం ఎత్తులో వుంది; ఆడవాళ్ళు, పిల్లలు ఎక్కలేకపోతున్నారు. మూలపేటరూట్లో వెళ్లాల్సిన బస్సులు కూడా అటట్టేపోవడంలేదు. కొత్త కలెక్టరుగారైనా టౌను బస్సులను అదుపుచేస్తారా?

నెల్లూరు -ఆర్. పి. రావు




**చాలా సంతోషం**

నెల్లూరులో రంజీ ట్రోఫీ క్రికెట్ పోటీలు నిర్వహించనున్నారన్నవార్త చదివి చాలా సంతోషించాము. క్రీడా రంగంలో వెనకబడివున్న నెల్లూరుకు ఇది మంచిఅవకాశం. ఇదేవిధంగా హాకీ, ఫుట్‌బాల్ తదితర మ్యాచ్‌లుకూడా నెల్లూరులో నిర్వహిస్తే బాగుంటుంది.

నెల్లూరు —పి. గోపి, పి. దీపక్

**కుష్ఠురోగుల బెడద**

నెల్లూరు టౌనులో కుష్ఠురోగుల బెడద జాస్తిగావుంది. ఈవ్యాధిగ్రస్తులు రోడ్ల మీద ఎక్కడబడితే అక్కడ యథేచ్ఛగా సంచరిస్తూ ప్రజలను ఇబ్బంది పెడుతున్నారు. కుష్ఠురోగాలలో కొన్ని అంటువ్యాధులని వైద్యులు, శాస్త్రజ్ఞులు చెప

-కొరవ 6వ పేజీలో

# తెలుగుభాషా సాహిత్యాలకు అయనచేసిన సేవ అనుపమానం
## విద్యారంగంలో అయన సృష్టించిన విలువలు ఆదర్శప్రాయం
# ఆచార్య జి. ఎస్. రెడ్డి

[వెంకటేశ్వర విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్స్‌లర్ ఆచార్య జి.ఎస్. రెడ్డి షష్టిపూర్తి సందర్భంగా, ఈ ప్రత్యేక వ్యాసం. -సంపాదకుడు]

సాహిత్య సౌహిత్యాలు. సముపేత పాండిత్యాలు. సరళ సౌజన్యా దార్యాల మూర్తీభవించిన మహామనీష. గురువులకు గురువు ఆచార్య శ్రీ జి. ఎస్. రెడ్డి (గోల్ల నారాయణస్వామిరెడ్డి).

సర్వోదకులుగా, సద్విమర్శక శ్రేష్ఠులుగా, ప్రామాణిక పరిశోధనా ప్రవీణులుగా, పరిపాలనాదక్షులుగా, సంకల్ప శక్తితో, లక్ష్యసిద్ధితో, కర్తవ్య నిష్ఠతో నాలుగు దశాబ్దాలకు పైగా వివిధ పదవులలో, విభిన్న హోదాలలో విద్యారంగానికి, ప్రధానంగా తెలుగుభాషా సాహిత్య సాంస్కృతిక వికాసానికి జి. యస్. రెడ్డిగారు చేసిన సేవ అనుపమానం, అనిర్వచనీయం.

విద్యారంగంలో ఎన్నో ఉన్నత పదవులు నధిష్ఠించినా, సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో ఎంతటి పాండితీప్రతిభామూర్తులైనా, ఎప్పుడూ, ఎక్కడా రవ్వంత అహంకారం చూపని వినయశీలం. అంతస్తుల అంతరువులను పాటించక అందరినీ ఆప్యాయంగా పలకరించి ఆదరించే మనస్తత్వం వారిది. "సాదాసీదా మనిషి"గానే కనిపిస్తారు; కాని ఆ మనిషిలో మనీషి తొణికిసలాడుతుంటారు.

మద్రాసులో పచ్చయప్ప కళాశాలలో విద్యార్థిదశలోనే అమేయ ప్రతిభాపాటవాలను ప్రదర్శించి ఎం. ఎ. పరీక్షలో మద్రాసు విశ్వవిద్యాలయంలోనే ప్రథమ శ్రేణిలో ప్రథములుగా ఉత్తీర్ణులై స్వర్ణ పతకాన్ని అవలీలగా పొందగలిగారు. ఆ విశ్వవిద్యాలయంలోనే తెలుగులో ఎం.లిట్ పట్టాపొందిన ప్రథములుకూడా వీరే. ఆ పట్టాకొరకు "తెలుగుసాహిత్యంపై ఆంగ్ల సాహిత్యప్రభావం" అనే అంశంపై ఆంగ్లంలో సమర్పించిన పరిశోధక గ్రంథం, మహావిద్వత్ ప్రముఖుల ప్రశంసలకు పాత్రమైంది. అలాగే పి.హెచ్‌డి. పట్టం కోసం ఆంగ్లభాషలో రచించి మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించిన "తెలుగు పదాల వ్యుత్పత్తి అర్థ పరిణామం (A study cf Telugu semantics) అనే పరిశోధక గ్రంథం తెలుగులో శాస్త్రీయమైన పద్ధతులలో, తొలిసారిగా సమర్పింపబడిన పరమ ప్రామాణిక గ్రంథంగా నేటికీ పరిగణింపబడుతూంది.

అమెరికాలోని విస్కాన్సిన్ యూనివర్శిటీలో విజిటింగ్ లెక్చరర్‌గా రెండేళ్లు వుండడమేకాక, దాన్‌మాట్‌సన్‌తో కలిసి తెలుగు అభ్యసించే అమెరికా విద్యార్థులకు ఉపయుక్తంగా రెండు పాఠ్యగ్రంథాలను రచించి యిచ్చారు. ఈ నాటికీ కొన్ని కళాశాలల్లో తెలుగు నేర్చుకునే అమెరికన్లకు ఆ గ్రంథాలు ఉపాదేయాలుగావున్నాయి.

అగస్త్యరెడ్డి వెంకురెడ్డి
ఎం. ఎ., ఎల్.ఎల్. బి.

ఆచార్య జి. యస్. రెడ్డి మొదట మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో తెలుగు విభాగంలో ట్యూటరుగా, అసిస్టెంట్ ప్రొఫెసరుగా, తర్వాత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకులుగా, రీడరుగా, ఆచార్యులుగా, శాఖాధిపతిగా, కళాశాలాధ్యక్షులుగా, విద్యార్థుల అభ్యున్నతికి, తెలుగుభాషా సాహిత్య వికాసానికి ఎంతగానో పాటుపడినారు. విద్యార్థి అధ్యాపక సంబంధాల నిర్వహణలో ఒక క్రొత్త ఒరవడిని సృష్టించారాయన.

కేవలం పాఠ ప్రవచనంతో, బోధనతో తృప్తిపడక విద్యార్థుల సమస్యలను ఆకళించుకొని, వారి సందేహాలను విసుగు విరామం లేకుండా నివృత్తిచేసి వారిలోని సృజనాత్మక శక్తులను ప్రేరేపించి వారిలో ఉత్తమ సంస్కారాన్ని పెంపొందించడానికి ఎంతగానో శ్రమించిన ఆదర్శ అధ్యాపకులు వారు.

విద్యార్థులకు హితులుగా, సన్నిహితులుగా, ఆప్తులుగా మెలగిన సుమనస్వి ఆచార్య జి. యస్. రెడ్డి.

పరిశోధనారంగంలోనూ వినూత్నమైన విధానాలను రూపొందించి, తానుస్వయంగా అనేక నూతనాంశాలపై పరమ ప్రామాణికాలైన పరిశోధనా వ్యాసాలను రచించి,

-కొరవ 8వ పేజీలో

# డి. కె. కాలేజి హాస్టలు సీట్లు పెంచకుంటే ఎట్లా?

నెల్లూరు డి కె మహిళా కాలేజిలో హాస్టల్ సీట్ల విషయం గగ్గోలుగావుంది. జిల్లాలో పేద, మధ్యతరగతి గ్రామీణరైతుల ఆడపిల్లల చదువులకు డి కె కాలేజి ఒక్కటే శరణ్యం. పల్లెలనుంచి నెల్లూరుకు వచ్చి కాపురాలు పెట్టే అవకాశం, స్తోమతలేని వారు డి కె కాలేజి పైనే ఆధారపడుతుంటారు. విద్యార్థినులకు మంచి చదువు, వుండడానికి సక్రమమైన వసతి కల్గిన కాలేజి ఇదొక్కటే కావడంతో సీట్లకు ఎప్పుడూ రద్దీగానే వుంటుంది. ఈ సంవత్సరం ఆ రద్దీ మరీ పెరిగిపోయిందట. తాలూకా మండల కేంద్రాలలో హైస్కూళ్ల సంఖ్య పెరగడం, తదనుగుణంగా కాలేజీలు ఏర్పడక పోవడంతో జిల్లామొత్తం నుంచి వందలు, వేల సంఖ్యలో విద్యార్థినీ, విద్యార్థులు నెల్లూరుపై పడ్డారు.

అబ్బాయిలకు ఒకటికి నాలుగు కాలేజీలున్నాయి. కానీ అమ్మాయిలకుండేది ఇదొక్కటే కాలేజి.

పాపం ప్రిన్సిపల్ శ్రీమతి శారదాదేవి తనకు అలవైనంతవరకు విద్యార్థినులను చేర్చుకున్నదట. నలుగురైదుగురు వుండడానికి కట్టిన హాస్టల్ గదులు ఒక్కొక్క దానిలో 20 మందివరకు సర్దుకునే ఏర్పాటు చేసిందట. అయినా ఇంకా సీట్లు దొరకక క్యూలో నిలబడినవారి సంఖ్య వందల్లో వున్నట్లుంది. విద్యార్థినులు, వారి తల్లిదండ్రులు గగ్గోలుపెడుతున్నారు.

జిల్లా నాయకులు, ఎమ్మెల్యేలు తమ క్యాండిడేట్లకు సీట్లు ఇమ్మని చీట్లు ఇవ్వడం తప్ప, ఈ సమస్య విషయమై ఎటువంటి ఆలోచనా చేస్తున్నట్లులేదు. అధికారుల సంగతి తెలిసిందే, కనీసం కలెక్టర్ వంటి అధికారులైనా జోక్యం చేసుకుని తక్షణం అదనపు హాస్టల్ మంజూరుకు ప్రయత్నించడం అవసరంకాదా? తగిన భవనవసతి దొరికేవరకు బాడుగ ఇళ్ళు వెతుక్కొని అయినా అదనపు హాస్టల్ తెరవకపోతే పల్లెలనుంచి వచ్చే ఆడపిల్లలు ఈ ఏటికి చదువు మానుకుని వెళ్ళిపోవల్సిన ప్రమాదం ఏర్పడుతుంది.

## సింహపురి

### ఆర్యవైశ్య సభ అధ్యక్షుడి రాజీనామా

నెల్లూరు జిల్లా ఆర్యవైశ్య సంఘ మహాసభ అధ్యక్షుడు శ్రీ మోరెం వెంకటేశ్వర్లు తనపదవికి రాజీనామా చేశాడు. సంస్థ గౌరవాధ్యక్షుడు శ్రీ సి. సి. సుబ్బరాయుడు, కార్యదర్శి శ్రీ బొమ్మిన సుబ్రహ్మణ్యం సంఘ కార్యకలాపాలలో వైశ్యులలో అనైక్యత ప్రేరేపిస్తున్నందువల్ల అసంతృప్తిచెంది, పదవికి రాజీనామా చేస్తున్నట్లు చెప్తున్నాడాయన.

### తాలూకాఫీసులో కొళాయి వేయాలి

నెల్లూరు తాలూకాఫీసు ఆవరణలో ఒక

—కొరవ 8 వ పేజీలో

# రైతులందరూ కలిసి ఒకేసారి చల్లితేనే పురుగుమందువల్ల పైరుకు ప్రయోజనం!

రైతులోకం
కీర్తి వెంకయ్య
ఎం. ఎస్‌సి., (అగ్రికల్చర్)
(వ్యవసాయ కళాశాల - తిరుపతి)

సాధారణంగా పైరు-పంట-దిగుబడి పొందాలంటే ముఖ్యంగా కావలసినవి నీరు, పోషకపదార్థములు. వీటికితోడు వాతావరణ పరిస్థితులు అనుకూలిస్తే అధిక దిగుబడులు పొందవచ్చుననేది నిర్వివాదాంశం. కాని పైరుమీద ఆశించే చీడపీడలు నివారణలో జాప్యంవలన దిగుబడి పది శాతం నుండి ఇరవై శాతం వరకు తగ్గిపోతుంది. కొన్నిపరిస్థితులలో దిగుబడి పూర్తిగా తగ్గిపోవచ్చుకూడా. ప్రస్తుత పరిస్థితులలో సస్యరక్షణ చర్యలు సరియైన సమయంలో పాటించుట చాలా ముఖ్యం. సకాలంలో సరియైన మందును పైరుపై పిచికారి చేయుటకూడా తెలుసుకోవాలి.

సిఫార్సుచేసిన మందు మోతాదును తగ్గించినా, మూకుమ్మడిగా రైతులు సస్యరక్షణ చర్యలు చేపట్టకపోయినా చీడపీడలను నివారించుట చాలాకష్టం.

సిఫార్సుచేసిన మందు మోతాదును తగ్గించి పైరుపై పిచికారి చేయుటవలన పురుగులలో నిరోధకశక్తి ఎక్కువై అవి చావవు. దీనివలన పురుగులసంఖ్య తగ్గకపోగా ఎక్కువవుతుంది. అందువలన సిఫార్సుచేసిన మందు మోతాదును తప్పకుండా చీడపీడల నివారణకు పైరుపై పిచికారి చేయాలి.

ఒకే ప్రాంతంలో రైతులందరు ఒకే పైరు వేసినప్పుడు సస్యరక్షణచర్యలు రైతులందరు కలిసి మూకుమ్మడిగాచేయాలి. లేకుంటే పైరుపై ఆశించే పురుగుల బారి నుండి తప్పించుకోవడం కష్టం. ఒక రైతు తన పొలంలో సిఫార్సుచేసిన మందు పైరుపై పిచికారిచేసినా పురుగులు చనిపోవును. అవేగాక ప్రయోజనకారిఅయిన క్రిములుకూడా చనిపోతాయి. ఇవి పంటకు నష్టంకల్గించే పురుగులను చంపే శక్తి సామర్థ్యాలు కలిగివుంటాయి. మందు ప్రభావం 10-15 రోజుల వరకు వుంటుంది. ఆతరువాత పైరు పచ్చదనంతో ఏపుగా పెరుగుతుంది. కాని ప్రక్క పొలంలో రైతు సస్యరక్షణ చర్యలు తీసుకొనకపోతే మందు చల్లిన పొలంలోకి (10-15 రోజులతరువాత) అంటే మందు ప్రభావం పోయినతరువాత పురుగులు మందుచల్లని పొలంనుండి మందుప్రభావం పోయి పచ్చగావున్న పైరును ఆశించి అధికనష్టం చేకూర్చవచ్చు. అంతేగాక

-కొరవ 8 వ పేజీలో

ఒక్క రోజులో ఒకే స్కూలులో ఇద్దరు హెడ్మాష్టర్ల బదలీ

# జి ప్ర ప ఛైర్మన్‌గారూ- ఏమిటీ గుడ్డి దర్బారు?

నెల్లూరు మండలం కనుపర్తిపాడు గ్రామస్తులు ఇటీవల జిల్లా ప్రజాపరిషత్ కార్యాలయం ఎదుట ధర్నా చేశారు. తమ హైస్కూలులో అయ్యవార్ల బదలీం వలి తంగా పిల్లల చదువులు బుగ్గిపాలౌతున్నా యని ఆందోళన చేశారు.

కనుపర్తిపాడులో 1970 లో హైస్కూలు పెట్టారు. ఈ పదిహేడేళ్లలో సంవత్స రానికి పట్టుమని పదిమంది పిల్లలుకూడా

## జిల్లావార్తలు

పదవతరగతి పాసుకాలేక పోతున్నారట. కారణం. టౌనుకు ఐదారు కిలోమీటర్ల దూరంలో వున్న ఈ హైస్కూలు పలుకు బడి కల్గిన పంతుళ్ళకు నిలయం కావడమే!

టౌనుకు దగ్గరగావున్న అన్ని స్కూళ్ల వలెనే, కనుపర్తిపాడు అంటేకూడా అయ్య వార్లకు భలేమోజు. నెల్లూరులోకాపురముండి రోజూ షటిల్ సర్వీస్ చేయవచ్చు; అద్ర ఉకియంగా 20 శాతం ఇంటి అద్దె అల వెన్సు కొట్టేయవచ్చు. దీనివల్ల మంత్రులలో, ఎమ్మెల్యేలలో, కాంట్రాకులో సాహుత్తు జి ప ఛైర్మన్ వద్దలో అండగావుండి, ఆశ్రయ మిచ్చే అయ్యవార్లే ఈ స్కూలుకు వస్తుం టారట. అంత పలుకుబడి కల్గిన పంతుళ్ళు, పిల్లలకు పాఠాలు చెప్తారా? చెప్పమని అడిగే ధైర్యం గ్రామస్తులకు వుంటుందా? ఇష్ట మైన రోజు స్కూలుకు రావడం, ఇష్ట మైనప్పుడు పోతే అప్పుడు తిరిగి వచ్చేయడం వారికి మామూలట. వారి నిర్లక్ష్యానికి తగి నట్లే ఈ పదిహేడేళ్ళు పిల్లల చదువులు ఏట్టుబండ నైనాయట.

ఈ అన్యాయం సహించలేక, ఇటీవల మాజీసర్పంచ్ శ్రీ బి. వి. రమణారెడ్డి కొందరు గ్రామస్తులను కూడేసుకొని ఛైర్మన్‌గారిదగ్గరకు రాయబారం వెళ్ళి పరిస్థితి వివరించి, తమ పిల్లలందరూ లెక్కల్లో ఫెయిల్ అవుతున్నారు కాబట్టి లెక్కలుచెప్పే హెడ్మాష్టరును నియమించ మని అడిగారట. అదేమిఖర్మోగాని ఈ రాయబారం నడిపినతర్వాత కనుపర్తిపాడు హైస్కూలు, ఛైర్మన్‌గారి బదలీల గ్రౌండుగా మారిపోయిందట. నాలుగు నెలకాలంలో నలుగురు హెడ్మాష్టర్లను అక్కడకు బదలీచేశారట. అందులో ఇద్దరిని ఒకేరోజులో నియమించి, అదేరోజు బదలీ చేసిపారేశారట. ఒకాయన గుండెజబ్బుని చెప్పి వచ్చినరోజే సెలవుపెట్టి వెళ్ళిపోయా డట. ఈ వచ్చినవారెవరిలోనూ గ్రామస్తు లడిగిన లెక్కలమాష్టరు లేనేలేరు.

ఛైర్మన్‌గారికి చెప్పి, చెప్పి విసుగు పుట్టి, పరిసరంలేక బి వి రమణారెడ్డి మొన్న ఆఫీసు ఎదుట ధర్నా జరిపారు. ఛైర్మన్

—కొరవ 10 వ పేజీలో

# మరొక శతాబ్దంపాటు కాంగ్రెస్ దేశాన్ని పాలిస్తుంది!

అధికార స్వాతంత్ర్య దినోత్సవాలలో పాల్గొనడం తప్ప, పార్టీ తరఫున జెండా ఎగురవేయడం అలవాటులేని కాంగ్రెస్ వాదులు ఈసారి తమకోసం ప్రత్యేకంగా ఈ ఉత్సవాన్ని వేడుకగా జరుపుకున్నారు. సంజీవరెడ్డి, జనార్ధనరెడ్డిద్వయం (ఇప్పుడు వారిద్దరు ఒక్కరుగాతప్ప,ఇద్దరుగాకన్పడ రేమేలేదంటే నమ్మండి!) కలిసి ఈఉత్సవం ఏర్పాటు చేశారు. మొదట ట్రంకురోడ్డు లోని గాంధీబొమ్మకు పూలమాలాలంకరణ; శ్రీ కె. ఎల్. నారాయణరావు చేశారు. అక్కడినుంచి కాంగ్రెస్ భవన్ వరకు

## అగస్టు 15

ఊరేగింపు. శ్రీ జనార్ధనరెడ్డి ఇందిరాగాంధీ విగ్రహానికి పూలమాలవేశారు. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు జాతీయ జెండా

—కొరవ 6వ పేజీలో

## గూడూరు వార్తలు ★ ★

### అంబులెన్స్

గూడూరులో లయన్స్‌క్లబ్ రోగుల కోసం అక్టోబర్ నుండి ఒక అంబులెన్సు నడుపుతుందట. మాజీ జిల్లా లయన్స్ గవ ర్నరు శ్రీ జె. పి. వెంకటేశ్వర్లు చెపుతు న్నారు.

అంబులెన్సు ఖరీదు లక్షా 20 వేలట. దీని నిర్వహణనిమిత్తం కొద్దిపాటి డబ్బును రోగులవద్ద తీసుకుంటారట.

### పోలీసుల దుర్మార్గం

గూడూరు ఎస్. కె. ఆర్. వ్రి డు త్ర కళాశాలలో బి. ఎ. మొదటిసంవత్సరం చదువుతున్న రా వు ం లీ మ య్య అనే విద్యార్థిని ఇటీవల గూడూరు పోలీసులు అమానుషంగాకొట్టారని విద్యార్థులవిర్యారు. ఎస్. కె. ఆర్. కా లే జి, పాలిటెక్నిక్, సిరామిక్స్ ఇన్స్టిట్యూట్ విద్యార్థులు తర గతులను బహిష్కరించి న్యాయం కోరు తున్నారు.

### రోటరీ ఉచిత నేత్రవైద్యం

గూడూరు డి. ఎల్. ఆర్. కమ్యూనిటీ హాలులో ఇటీవల వారంరోజులపాటు రోటరీ క్లబ్ అధ్వర్యంలో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం నిర్వహించినందుకు అభినందనగా చిన్నసభ జరిగింది. డాక్టర్ ఎం. యానాది నాయుడు ముఖ్యఅతిథి; డాక్టర్ టి. కృష్ణా రెడ్డి, ఫ్రొబేరియన్ డాక్టర్ సి. జనార్ధన రెడ్డి, డాక్టర్ ఎల్. నరసింహులు పాల్గొ న్నారు. శిబిరంలో రోగులకు నిస్వార్థ సేవ

—కొరవ 6వ పేజీలో

## నెల్లూరు నలుచెరగులా
### విశ్లేషకుడు

### చంద్రబాబు రాక, పోక

కర్షకపరిషత్ అధ్యక్షుడు శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు 14 తేది రాక, సూళ్ళూరుపేట, నాయుడుపేట, కాలాయపల్లె, వెంకటగిరి తదితర ప్రాంతాలన్నీ తిరిగి గూడూరులో రైలెక్కి హైదరాబాద్ వెళ్ళారు. జిల్లా తెలుగుదేశం నాయకులు ఎంతో పోలీసుపరంగా ఏర్పాట్లు చేశారు. కార్లకారే వర్గాంగుదూరం వున్నింది. దారి పొడుగునా జనాన్నికూడా పెద్దయెత్తున సమీకరించారు. అయితే బాబు మాత్రం స్థానిక నాయకులెవరినీ ప్రత్యేకంగా పలకరించనూలేదు; పట్టించుకోనూలేదు. తిరుపతి ఉపఎన్నిక సర్వే ఆయన పర్యటనోద్దేశ్యమైనా, ఎవ్వరితోనూ ఆ విషయం ప్రస్తావించినట్లుకూడాలేదు. వచ్చారు, పోయారు అంతే!

### జి. కె. రెడ్డి వర్ధంతి

ఆంగ్లపత్రికా లోకంలో ప్రపంచ వ్యాప్త గుర్తింపుపొందిన నెల్లూరీయుడు హిందూ విలేఖరి స్వర్గీయ జి. కె. రెడ్డి ప్రథమవర్ధంతి సభను 17 తేది టౌన్ హాల్ లో తిక్కవరపు సుబ్బరామిరెడ్డి కల్చరల్ అసోసియేషన్ నిర్వహించింది. శ్రీ కె. వి. రెడ్డి అధ్యక్షించారు.

'జమీన్‌రైతు' మేనేజింగ్ ఎడిటరు శ్రీరామమూర్తి జి. కె. రెడ్డిగారి పాత్రికేయ జీవిత వైశిష్ట్యాన్ని వివరించారు. చుండి విశ్వనాథంగారివలె 'హిందూ' విలేఖరిగా అరవైఏళ్ళపాటు పనిజేసినవాడు రాష్ట్రంలో మరొకరుండరంటూ, ఆయన చిల్లరవార్తలకు కాకుండా సమస్యలకు ప్రాధాన్యత ఇచ్చారని, అదే ఆయన ప్రత్యేకతని శ్రీ రామమూర్తి అన్నారు. 'లాయర్' సంపాదకుడు శ్రీ తుంగా రాజగోపాలరెడ్డి జి. కె. రెడ్డి పేరుతో సత్కారానికి విశ్వనాథంగారికంటే అర్హులైన పాత్రికేయుడు మరొకరు లేరన్నారు.

అసోసియేషన్ పక్షంగా శ్రీ గునుపాటి రామచంద్రారెడ్డి విశ్వనాథంగారికి ఐదువేల రూపాయల పర్సును అందజేశారు. అతిథులు శాలువలతో సత్కరించారు. మొదట శ్రీ మునిరాజా స్వాగతించగా, చివర శ్రీ పి. శ్రీనివాసరావు వందనాలు చెప్పారు.

### ''అపోలో జ్యోతి''

హైదరాబాదులో నెలకొల్పబడిన అపోలో హాస్పిటల్స్‌కు 27 తేది రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ ప్రారంభోత్సవం చేయనున్న సందర్భంలో, మద్రాసు నుండి జ్యోతితో బయలుదేరే ''రన్ ఫర్ హెల్త్'' అనేబృందం 21 తేది నెల్లూరుకుచేరి టవున్‌లోని వివిధప్రాంతాలలో ఆరోగ్య ప్రచారం చేస్తుందట.

ఆరోజు ఉదయం 9నుండి డయాబెటిస్, బ్లడ్ ప్రెషర్ వుందో లేదో అపోలో డాక్టర్లు ఉచితంగా పరీక్షజేస్తారట. 30 సంవత్సరాలకు పైబడిన వయస్కులు పోలిస్ పెరేడ్ గ్రౌండుకుపోయి ఈసదవకాశాన్ని వినియోగించుకోవచ్చు.

### గూడూరుగొడవ రాజీ

గూడూరు టవున్ ఎస్. ఐ. ఒక కాలేజివిద్యార్థిమీద దెబ్బలేసుకోగా, దానికి నిరసనగా విద్యార్థులు సమ్మెచేస్తూ ఆందోళన జరుపుతుండినారు. ఈరోజు డి. ఎస్. పి. శ్రీ పద్మారావు, టవున్ కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎల్లసిరి గోపాలరెడ్డి, ఎ. బి. వి. పి. నాయకుడు శ్రీ చంద్రశేఖర్ జోక్యంచేసుకొని మంతనాలుజరిపి దెబ్బలు తిన్న విద్యార్థి - కొట్టిన ఎస్. ఐ. ల చేత కరచాలనంచేయించి, సామరస్యంగా పరిష్కరించారట. అభినందనీయమైన విషయం.

కాలానుగుణంగా మారకపోతే పోలిస్ పరువు పోగొట్టుకుంటుంది!

### దొంగ పాఠ్య పుస్తకాలు

దొంగనోట్లవలె ప్రభుత్వ పాఠ్యపుస్తకాలుకూడా దొంగసరకు విస్తారంగా చెలామణిలో వున్నట్లుంది. ప్రయివేట్ పుస్తకాల అంగళ్ళలో తప్ప సొసైటీలు గిసైటీలలో దొరకడంలేదని చెప్తున్నారు.

నెల్లూరు టవున్‌లో ఈ నకిలీ ప్రభుత్వ పాఠ్యపుస్తకాలు ఒక్క అంగడిలో మాత్రం దొరుకుతున్నాయని; 3వ తరగతి తెలుగు వాచకం ప్రభుత్వధర రూ 2.60 అయితే రూ 4.00ల వంతున; 5వతరగతి పుస్తకం రూ 2.70 అయితే రూ 4.00 ల వంతున అమ్ముతున్నారని; అమాయకులు పోతే ఐదు రూపాయలు గుంజుతున్నారని తెలుస్తున్నది.

గమనార్హమైన మరో విశేషం - పుస్తకాల అట్టపై రంగులలో మార్పువున్నదట; ప్రభుత్వ పుస్తకాలపై ఆకుపచ్చ రంగు ప్రింటు అయితే, నకిలీ పుస్తకాలమీద బ్రౌన్ కలరట.

ఈ పాఠ్యపుస్తకాల దొంగ వ్యాపారం ప్రభుత్వానికి తెలిసే జరుగుతున్నదా? ఇందులోకూడా ఏదైనా తెలుగు కుంభకోణం వున్నదా?

### ఇందిరమ్మ రథం

ప్రదేశ్ కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి శ్రీ వి. హనుమంతరావు తన ప్రచార బృందంతో ఇందిరమ్మ రథారూఢులై మనజిల్లాలోకూడా 20 తేదినుండి వారం రోజులపాటు పర్యటించబోతున్నారు. సూళ్ళూరుపేట, వెంకటగిరి, గూడూరు, ఆత్మకూరు, ఉదయగిరి, కావలి, సర్వేపల్లి నియోజకవర్గాలలో ఆ పర్యటన వుంటుందట. ఆ వాహనానికి మర్చిన ఇందిరా గాంధీబొమ్మే పెద్ద ఆకర్షణట.

ఇందిరమ్మ రథం అంటే - రామారావు గారి చైతన్యరథంవలెనే - మైకులు, లైట్లు, వేదిక, పాటలు గేయాలు కమ్మగా పాడే బృందాలతోటి సర్వశోభితంగా వుంటుంది.

### టెలిఫోన్ డైరెక్టరీలు

టెలిఫోన్ వినియోగదార్లకు తియ్యని వార్త. 31-8-1988 వరకు సవరించబడిన క్రొత్త టెలిఫోన్ డైరెక్టరీలు నెల్లూరు, గూడూరు, కావలి ఎస్. డి. ఒ. కార్యాలయాల్లో పంపకానికి సిద్ధంగావున్నాయట. నెల్లూరులోతప్ప తక్కిన అన్నిచోట్ల 22-8-88 నుండి ఆయా ఎక్స్చేంజిలనుండి డైరెక్టరీలను పొందవచ్చు. నెల్లూరులో మాత్రం ఎస్. డి. ఒ. ఆఫీసు నుండి ఉదయం 9-30 నుండి సాయంత్రం 5 గంటల లోగా పొందవచ్చు.

డైరెక్టరీలు ఖరీదుకు కూడా అమ్మబడుతాయి; ఒక్కొదానిధర పదిరూపాయలు. నెల్లూరు జిల్లా టెలిగ్రాఫ్ ఆఫీసు, టెలికమ్యూనికేషన్స్ జిల్లా ఇంజనీరు కార్యాలయాల్లోను; గూడూరులో డి. టి. ఓ. ఆఫీసులో దొరుకుతాయి.

### రొట్టెల పండుగ

నెల్లూరులో రొట్టెలపండుగ పేరుతో వేలాదిమందిని ఆకర్షించే మొహరం జియారత్ 26 తేది అట. కుల మత వర్గాల కతీతంగా దీనికి జనం వస్తారు; అందులో స్త్రీలు అత్యధికం.

మూఢత్వంగాని చెరువులోని బురద నీటిలో తేలియాడే రొట్టెలను తింటే సంతానం కలుగుతుందా? రోగాలు నయమవుతాయా? కోర్కెలు నెరవేరుతాయా?

### సంస్మరణ

తుది నిశ్వాసం వరకు జీవితాన్ని "జమీన్ రైతు" సేవకు అంకితంచేసి ధన్యులైన మా తూపిలి పార్థసారధి గారు మమ్ము వీడి స్వర్గధామంచేరి రేపటికి తొమ్మిదేళ్ళు గడుస్తాయి. ఈ సందర్భంలో వారిని సంస్మరిస్తూ వారి కీర్తిమూర్తికి అంజలి ఘటిస్తున్నాము.

### హోంగార్డుల సెలక్షన్

నెల్లూరుజిల్లాలో హోంగార్డుల ఖాళీలకు 28, 29 తేదుల్లో సెలక్షన్లు జరుగుతాయట. 10వ తరగతి చదివిన యువతీ యువకులు 24 తేదీలోగా పోలీసాఫీసులో దరఖాస్తులు దాఖలుచేయాలి!

—తరువ 6ఎ పేజీలో

## వేరేదారి

*(మొదటిపేజీ తరువాయి)*

వేరుగా పుంజాలశివప్ప, 'శివయ్య సేన' పేరిట అనేకసార్లు బాహరారని ఆయన అభ్యంతరం చెప్తున్నాడు. ఈ 'హింసాత్మక కారణం' పాపం శివయ్యను గాలిలో వేల కట్టేసింది.

ప్రధాని రాజీవ్‌గాంధీనుంచి మాటతీసుకున్న తర్వాతకూడా తనను పార్టీలో చేర్చుకోవడానికి ఇన్ని ప్రతిబంధకాలు ఎదురు కావడం, అనవసర కాలయాపన జరగడంతో శ్రీనివాసులురెడ్డి పునరాలోచనలో పడ్డారని ఆయన సన్నిహితులు చెప్తున్నారు. పార్టీలో చేరకముందే పరిస్థితి ఇలా వున్నప్పుడు చేరిన తర్వాత ఇంకెన్ని అవాంతరాలు ఎదురౌతాయోనని ఆయన భయపడుతున్నారట. గతానుభవాలు ఆయన మర్చిపోలేదు, మర్చిపోలేరు కదా!

ఇంత జరిగిన తర్వాత కాంగ్రెస్‌ను హఠాత్తుగావదలివేయటం తనకు శ్రేయస్కరం కాదని ఆయనకు తెలుసు. కాని దానికోసం ఎదురుచూస్తూకూర్చుంటే, ఈలోగా తాను రాజకీయంగా అజ్ఞాతవాసానికి వెళ్లిపోయే ప్రమాదంవుందని ఆయన భయపడుతున్నారు. ఈ చిక్కు సమస్యను తప్పించుకునేందుకు ప్రత్యామ్నాయమార్గాన్వేషణకై ఆయన తన అనుచరులతో సంప్రదింపులు జరుపుతున్నారట. జనతా సమాజ్‌వాదితో ద్వారా ప్రతిపక్షం ఫ్రంట్‌లో చేరమని కొందరు సలహా ఇచ్చినట్లుంది. అయితే అప్పుడు ఎన్టీఆర్‌తో కలిసిపనిచేయవలసి వస్తుంది. తాను సిగ్గువిడిచినా, ప్రజలు ఆమోదించుకుంటారనిభయపడుతున్నారు.

ముద్రగడ పద్మనాభం చేపట్టిన ఉద్యమంతో చేతులు కలపడం తన భవిష్యత్తుకు అన్నివిధాలా శ్రేయస్కరమని ఆయన భావిస్తున్నారు. ఇప్పటికే గంగాధర్ రెండుసార్లు కిర్లంపూడివెళ్ళి పద్మనాభంతో మాటాడుగా ఈ విషయం ప్రస్తావించి వచ్చారు. ప్రతిపక్షంలోని జైపాల్‌రెడ్డి వంటి పాతమిత్రులుకూడా శ్రీనివాసులు రెడ్డికి ఇదే సలహా ఇచ్చారట. పద్మనాభానికి ప్రజలలో అపరిమితమైన ఆదరణ వున్నప్పటికీ, ఆయన మంచి వక్త కాకపోవడం, రాజకీయ జిమ్మిక్కులు తెలియక పోవడంవల్ల కాపునాడు ఉద్యమం బలపడలేకపోతున్నది. శ్రీనివాసులురెడ్డివంటి రాజకీయ జిత్తుల నిపుణుడు ఆయన ప్రక్కనుంటే కాపునాడుఉద్యమం రాష్ట్రవ్యాప్తమై, ఎన్టీ రామారావుకు నిజమైన సవాల్ గా పరిణమిస్తుందని అందరూ సలహా ఇస్తున్నారట.

ఇంకొక ప్రక్క శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి పేరు అకస్మాత్తుగా పిసిసి అధ్యక్ష పదవికి అల్లా వినిపిస్తున్నది అయన్ను కలవరపరుస్తున్నది. ఇప్పట్లో పిసిసి మార్పేమీ వుండదని తెలుస్తున్నా, ఒకవేళ తన ప్రవేశానికి ముందుగానే పిసిసి జనార్దనరెడ్డి చేతుల్లోకిపోతే, తన భవిష్యత్తు అంధకారబంధురమైపోతుందని ఆయన భయపడుతున్నారు. ఢిల్లీలోవున్న గంగాధర్ ఆంధ్ర పార్లమెంటు సభ్యులందరికీ ఈ విషయం ప్రత్యేకంగా నొక్కి నొక్కి చెప్తున్నారు. ఊహాగానాల్లోనైనా ఆయన పేరు వచ్చినా శ్రీనివాసులురెడ్డి కాంగ్రెస్‌కు దక్కకుండా పోతాడని బెదిరిస్తున్నట్లు కూడా తెలుస్తోంది. ఈ బెదిరింపులతోనైనా తమ ప్రవేశం త్వరితగతిన జరుగుతుందని ఆయన ఆశ.

మొత్తంమీద కాంగ్రెస్‌లో చేరికే తన అంతిమ లక్ష్యమైనప్పటికీ, తాత్కాలికంగా అజ్ఞాతవాసం తప్పించుకునేందుకైనా శ్రీనివాసులురెడ్డి వేరేదారులు వెతుక్కోక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఆదారి ఏదన్నదే అసలు సమస్య. రానున్న ఒకటి రెండు వారాలలో ఈ విషయమై ఒక నిర్ణయం జరిగే అవకాశం వుంది. ★



## నెల్లూరుముచ్చట్లు

(8 వ పేజీ తరువాయి)

### కొత్త అడిషనల్ ఎస్. పి.

అడిషనల్ పోలీసు సూపరింటెండెంటుగా శ్రీ వి. ఆర్. కె. మోహనరావు ఇటీవలనే పదవిబాధ్యతలు స్వీకరించారు. కర్నూలునుండి వచ్చారీయన. మనిషి సమర్థుడు, మంచివాడంటున్నారు. ఇంత వరకూ ఈ హోదాలో వుండిన శ్రీ బి. కాశీనాథ్ ప్రమోషన్‌పై వెళ్ళారు.

### ఇందిరాగాంధిపై నెల్లూరు యువకుడికి డాక్టరేట్

సింగపేటకుచెందిన క్రైస్తవయువకుడు శ్రీ కంచెదేవదానం(28)డాక్టరేట్ పొందారు. ప్రధానమంత్రిగా శ్రీమతి ఇందిరాగాంధీ పనితీరు అనే అంశంపై ఆయన సమర్పించిన పరిశోధనా పత్రానికి వెంకటేశ్వర విశ్వవిద్యాలయం రాజకీయ శాస్త్రంలో పి హెచ్ డి పట్టా ప్రదానంచేసింది.

దేవదానం సింగపేట వాస్తవ్యుడు. ఆయనతండ్రి శ్రీ కంచె శామ్యూల్ రిటైర్డు టీచరట. సర్వోదయ కాలేజిలో బి. ఎ. తిరుపతిలో ఎం.ఎ. విద్యానగర్‌లో బి.ఇడి. చదివారట. పి. హెచ్.డి.కి ముందు ఎం. ఫిల్‌కూడా చేశాడు. అల్లూరు మండలంలో డాక్టరేట్ పొందిన తొలి ప్రతిభావంతుడు దేవదానమేనని చెప్తూ, సంతోషం వ్యక్తంచేస్తున్నారు ఆ గ్రామస్తులు.

### సర్వోదయలోనూ విజిలెన్స్ దర్యాప్తు

సర్వోదయ కాలేజిపై కూడా విజిలెన్స్ దర్యాప్తు జరుగుతూంది.

ఇప్పుడుండే కమిటీని ఎట్లయినా తీరవేరకాలని సి సి సుబ్బరాయుడుగారిపంతం; సభ్యుల మద్దతులేదు; అందువల్ల పసుపు చొక్కాధరించి అన్నగారి పాదశరణువేడినట్లున్నాడు. ఏదో ఒక సాకుతో వేధింపు తీనడానికి విజిలెన్స్ దర్యాప్తుకు ఆదేశించవేశారట. వారు వచ్చి స్కాలర్‌షిప్‌లకు సంబంధించిన ఫైళ్ళుస్వాధీనంచేసుకున్నారు.

కావలిలోని ఒక విద్యాసంస్థ ఇచ్చిన బోగస్ ఇంటర్మీడియెట్ సర్టిఫికేట్లకు సంబంధించి కూడా సిబి సిఐడి సర్వోదయ కాలేజిలో దర్యాప్తు జరుపుతూంది.

### అక్కంపేట పోస్టాఫీస్

గతవారం జిల్లావార్తలలో అక్కంపేట బి. పి. ఎం. శ్రీ వి. రంగయ్య పోస్టల్ ఇన్‌స్పెక్టర్ తనమండి దౌర్జన్యంగా డేట్ సీలు, రికార్డు ఎత్తుకపోయాడని చేసిన ఆరోపణకు గూడూరు పోస్టల్ అసిస్టెంటు సూపరింటెండెంటు అయిన శ్రీ పి. రామచంద్రారెడ్డి సుదీర్ఘమైన జవాబు వ్రాశారు.

రంగయ్య బి. పి. ఎం. కాదని, తాత్కాలికంగా అతని భార్య బి. పి. ఎం. గా వ్యవహరిస్తుండినదని, రెగ్యులర్ అభ్యర్థిని సెలక్టుచేసి అతనికి చార్జి ఇవ్వమంటే ఇవ్వలేదని, ఆపీడట తాను వాటిని తీసుకొని కొత్తగా నియమింపబడిన బి. పి. ఎం. కు అప్పగించానని, ఆసీ యదార్థవిషయాన్ని మనుబోలు పోలీసుకు అప్పుడే తెలియజేశానని శ్రీ రామచంద్రారెడ్డి జవాబుసారాంశం!

తెలిసిన అఫూరి రెడ్డిగారొకరు రంగయ్య స్వయంగా వ్రాసిన ఆ వార్తను తెచ్చిఇస్తే నిజమని నమ్మి ప్రకటించవలసి వచ్చింది. పల్లెటూళ్ళలో వుండే పెద్ద మనుషులు వ్యక్తుల మొగమోటాలకు లొంగలారేగాని, వాస్తవాలకు కట్టుబడరు. తమ ఈ పక్షపాత వైఖరితో మమ్ములనుగూడా పొరపాటు బడేటట్లు చేస్తారు! అక్కంపేట వార్తనుగూర్చిన వాస్తవాన్ని పాఠకులు గమనించాలని కోరుతున్నాము.

### పాత్రికేయులకు పరాభవం

చంద్రబాబు పర్యటనకోసం తిప్పవరపు భేర్మిజాగారు తనకిష్టులైన కొందరు పాత్రికేయులను ప్రత్యేకంగాపిల్చి, కారిచ్చి, వెంటబెట్టుకొనిపోయారట. అయితే వారిని నాయుడుపేట తెలుగుదేశీయులు మెనపల్లె బయటకు గెంటినంత పనిచేసి, అవమానించి పంపారట. భేర్మిజాగారు వీరందరినీ ఒక గదిలో కూర్చోబెట్టి, మంత్రిగారికి ఎదురుకోలు పల్కను తరకు వెళ్ళాడట. అది బాబుకు కేటాయించినగదిఅట. పాత్రికేయులు అందులోకూర్చొని అపవిత్రం చేయడం తెలుగుదేశీయులకు నచ్చలేదు. ముందు మర్యాదగా గదిఖాళీచేసి పొమ్మన్నారట;మేమువిలేఖరులమని వీరు కాలరెగరేసేసరికి 'పోకుంటే, మేమే పంపేస్తాము'న్నట్లు గద్దించారట. ఇంత పరాభవం జరుగుతున్నా ఒక్కరూ తనురుఅంత రాకపోవడంతో పాపం చిన్నముఖం పెట్టుకొని తిరిగివచ్చేశారు. ఈ నాడు విలేఖరులకు మాత్రం తెలుగుదేశంలో 'స్పెషల్ ట్రీట్‌మెంట్' కాబట్టి వారీపరాభవం తప్పించుకున్నట్లున్నారు.

తాను పిల్చినవారికి అవమానం జరిగిందన్న చింతకూడా వ్యక్తంచేయలేదట దేగా నారసింహారెడ్డిగారు! తెలుగుదేశం సంస్కారం అది! వీరందరికీ జమీందారైతు నిపిద్దపత్రిక కాబట్టి, మా విలేఖరులకు ఈ పరాభవ ప్రమాదం తప్పింది.

### కండ్లేరు రైతుల ఆందోళన

తెలుగుగంగ పథకంలో భాగంగా నిర్మితమౌతున్న కండ్లేరు రిజర్వాయర్ క్రింద మునిగిపోయే భూములకు నష్టపరిహారం ఇవ్వడంలో ప్రభుత్వ జాప్యానికి నిరసనగా కండ్లేరు రైతులు 19 తేది నెల్లూరులో ఆందోళనచేసి, అరెస్టయ్యారు. మాజీఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు ఈ సమస్యపై చాలాకాలంనుంచి పోరాటం జరుపుతున్నాడు, విన్నపాలు, వినతిపత్రాలతో ఫలితంలేక ఈమధ్య కాల్వత్రవ్వకం పనులకు అడ్డంపోయారు. అదీ నిష్ప్రయోజనమన్నీ తేలడంతో నెల్లూరుకు వచ్చి ధర్నాలు జరిపించారు. ఈ ధర్నాలో ఆయనతోపాటు సి. వి. శేషారెడ్డి, శ్రీ ఊటుకూరు ఆదిమూర్తి తదితర కాంగ్రెస్ వాదులుకూడా అరెస్టయ్యారు.

### మరణాలు

కరటంపాడు సర్పంచ్ గా దాదాపు పాతికేళ్ళపాటు పనిచేసి, గ్రామస్తుల గౌరవాభిమానాలు చూరగొన్న సౌమ్యుడు శ్రీ వేమన పాపయ్యనాయుడు (57) లివర్ క్యాన్సర్‌తో అస్వస్థుడుగావుండి 11 తేది కన్నుమూశాడు. ఆయనకు ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. ఒకకుమార్తె శ్రీమతి వసంతలక్ష్మి 'ఉదయం' పత్రికలో పనిచేస్తున్నది. పాపయ్యనాయుడు గుంటూరు జి. కె. నాగర్లమూడి చంద్రమౌళిగారితో వియ్యమందినవారు. నాయుడుగారి కుటుంబానికి మా సానుభూతి.

* * *

మల్లికార్జున మైన్స్ అధిపతి శ్రీ అనపల్లి అశోక్‌కుమార్‌రెడ్డి తండ్రి, కోవూరు పెద్దరైతు శ్రీ అనపల్లి వెంకురెడ్డి (72) 18 తేది సాయంత్రం మరణించారు. ఆయనకు అశోక్‌రెడ్డి ఒక్కడే కుమారుడు. ముగ్గురు కుమార్తెలు, భార్య వున్నారు.

### నీటిమట్టం

| | |
|---|---|
| సోమశిల రిజర్వాయరు (19 తేది) | 6.22 టి. ఎం. సి. |
| కనిగిరి రిజర్వాయరు | 16.9 అ. |
| సర్వేపల్లి | 1.9 అ. |
| నెల్లూరు చెరువు | 14.1 అ |

సోమశిల రిజర్వాయరుకు 300 క్యూసెక్కులనీరు వస్తున్నదట. పెన్నకు కొద్దిగా నీరు వచ్చిందిగానీ, అది బొగ్గేరు వగైరాలకు సంబంధించిన క్రీకునీరేనట.

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకు | పుట్టి | 2200.00 |
| బి. ఆర్. 20 | | 2000.00 |
| 2608 (సన్నాలు) | | 1800.00 |

మూడువారాల నుండి ధాన్యం ధరలలో హెచ్చుతగ్గులులేవు. నెల్లూరులో మొలగొలుకు బియ్యం చిల్లరగా కిలో రూ 4.50 వంతున అమ్ముడుతున్నాయి. ★







## ఉత్తరక్రియలు

మా తల్లి

**ఎన్. జయలక్ష్మమ్మగారు**

(స్వర్గీయ ఎన్. కనకంబాబుగారి శ్రీమతి)

14-8-88 ఆదివారం ఉ॥ 9గంటలకు స్వర్గస్థులైనారు

**పెద్దకర్మ**

22-8-88 సోమవారం నెల్లూరులోని మా స్వగృహమందు జరుగును. కావున తెలుపడమైనది.

ఎన్. పురందరప్రసాద్ & బ్రదర్స్



## పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

చూరగొంటారు. సాధారణంగా జర్నలిస్టులు ఒక్కచోట ఇమడరు, మంచిగా పనిచేసేపోరు. కాని జి. కె. రెడ్డి అందుకు భిన్నమైన జర్నలిస్టు. ఆయన మరణించినప్పుడు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' ఎడిటోరియల్ వ్రాసిందన్నా, 'హిందూ' మొదటి పేజీలో ఏ జాతీయ నాయకునికీకూడా ఇవ్వనంత ప్రాధాన్యతతో గుణగానం చేసిందన్నా ఆయన ఆ పత్రికకు చేసిన సేవను, సువ్యాఖ్యానాన్ని, గౌరవాదరాలను ఎంతగా చూరగొన్నారో తెలియజేస్తుంది.

జి. కె. రెడ్డి రాజకీయవాది కాదు. పార్టీలు, సమస్యలు, సంఘటనలు, నాయకులకు సంబంధించి ఆయనకు స్వంత అభిప్రాయాలు లేవనికాదు; అభిమాన దురభిమానాలకు ఆయన అతీతుడనికాదు; కాని అవి తనవరకే. తన వ్రాతల్లో అవి ప్రతిబింబించేవికావు. పత్రికలో ఆయన వార్తాకథనాన్నిబట్టి ఆయనఅభిప్రాయాలుగాని, ఆయన వైఖరిగాని తెలిసికొనే వీలుండేది కాదు. పత్రిక అభిప్రాయాలే తన అభిప్రాయాలుగా, తన అభిప్రాయాలే పత్రిక అభిప్రాయాలుగా, రెండిటి మధ్య భేదంలేనంత సమైక్యంగా వుండేవి. అంటే పత్రిక విధానానికి అనుగుణంగా తాను వ్రాసేవాడుకాని, తన స్వంత అభిప్రాయాలను అందులో చొప్పించేవాడుకాదు. ఈ మాట నేనెట్లా చెప్పగలుగుతున్నానంటే ఎమర్జెన్సీకి 'హిందూ' పత్రిక సుముఖం. జి. కె. రెడ్డిగారి వార్తాకథనాలన్నీ తదనుగుణంగానే వుండేవి. అయినా అత్యయిక పరిస్థితికి అనుకూలుడనుకునేవాణ్ణి. ఒకసారి నెల్లూరు వచ్చినప్పుడు మాటల్లో ఎమర్జెన్సీకి వ్యక్తిగతంగా ఆయన ఎంత వ్యతిరేకుడైందీ విదితమైంది. అంటే తన అభిప్రాయాలు తనవిగా, పత్రికవ్రాతలు పత్రికవిగా జి. కె. రెడ్డి పరిగణించేవాడన్నమాట. అసలు వార్తను వివరించడం విశ్లేషించడం తప్ప వూహాగానాలు చేయడమో, వ్యక్తుల పట్ల అభిమానం ప్రదర్శించడమో చేసేవాడుకాదు. జి. కె. రెడ్డి వూహాగానంగా ఒకవార్త ఇచ్చినా, అది మరునాటికల్లా అధికారికంగా ధృవపడేది. అంటే ఖచ్చితంగా తెలిస్తేతప్ప, లూజు తరహా వార్తలు ఆయన ఇచ్చేవాడేకాదు. అందువల్లనే జి. కె. రెడ్డి వార్త అంటే అధికారవార్తగానే పరిగణన పొందేది. దానివల్ల హిందూ స్థాయికూడా పెరిగేది. జి. కె. రెడ్డి సంచలన వార్తల జర్నలిస్టుకాదు; అట్లనే వ్యక్తులమీద, సంస్థలమీద బురదచల్లే కలం కాదు ఆయనది. సౌమ్యత, సౌజన్యత, వున్నతస్థాయి ఆయన వ్రాతలప్రత్యేకత. జి. కె. రెడ్డి మరణానంతరం 'హిందూ' స్వరూప స్వభావాలు తల్లక్రిందులైపోయా అనిపిస్తుంది,

నాకు తెలిసి ఇటీవల సంవత్సరాలలో జి. కె. రెడ్డి వ్యక్తులకు సంబంధించి పేరు పేర్కొంటూ బయటపడి వ్రాసింది ఒకే ఒక సందర్భంలో. భవనం వెంకట్రాం స్థానంలో పార్టీ నాయకత్వ వూహాగానాలు జరిగేటప్పుడు జి. కె. రెడ్డి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి నాయకుడు కాబోతున్నాడని నొక్కి వ్రాశాడు. జనార్దనరెడ్డిపట్ల అయనకు ప్రత్యేకాభిమానం వున్నమాట యథార్థమే. అయినా, ఆ అభిమానంతో ఆయన అట్లా వ్రాసివుండడు; నాయకుడు జనార్దనరెడ్డి అనేది ఢిల్లీలో నిర్ణయం జరిగిపోయింది; కాని ఆఖరుక్షణంలో అదృష్టం విజయభాస్కరరెడ్డిని వరించింది. క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్ అన్నరీతిగా చివరి క్షణంలో జరిగిన అమార్పును వూహించలేక, అందుకోలేక జి. కె. రెడ్డి పొరబడి వుంటారేమోనని నా వూహ.

జి. కె. రెడ్డిగారిలోని మరో విశేషగుణం. రాజకీయ సంఘటనలను, విషయ పరిజ్ఞానాన్ని ఆయన స్వంత వ్యాపారానికో, పేరు ప్రఖ్యాతులకో వుపయోగించుకోడానికి ప్రయత్నించకపోవడం. ఎమర్జెన్సీ సమయంలోకాని, ఇతర సందర్భాలలోగాని కులదీప్ నయ్యర్, కుష్వంత్ సింగ్‌వంటి జర్నలిస్టులు సమయానుకూలంగా పుస్తకాలు వ్రాసి ఎంత సొమ్ము చేసుకోలేదు! జి. కె. రెడ్డిగారికి ఎప్పుడూ అటువంటి తలంపే వచ్చినట్లులేదు. అదీకాక ఆయనకు ఇద్దరు కుమారులైతే, ఒక్కరినీ జర్నలిజంలో ప్రవేశపెట్టలేదు. వారికి ఆ వృత్తిపట్ల ఆసక్తి అభిరుచులు లేకనో, ఆ వృత్తి జీవితంలో పూలబాటకాదని జి.కె. రెడ్డి తానే అభిప్రాయపడినాడో తెలియదు!

వ్యక్తిగతంగాగాని, వృత్తిపరంగాగాని ఆయనకు వ్యతిరేకులే లేరు. పార్టీ వర్గరహితంగా అగ్రనాయకులందరూ ఆయనకు అభిమానులే. జి. కె. రెడ్డిగార్నిగూర్చి ఒక్కమాటలో చెప్పాలంటే వృత్తిలో ఆయన సమున్నతుడు, వ్యక్తిగా ఆయన సర్వప్రియుడు.

ఒకరిని నొప్పించకుండా, వివాదాస్పదులు కాకుండా, సర్వప్రియంగా, అజాతశత్రుత్వంగా, అంకితభావంగా. పరిజ్ఞానశాలియైన జర్నలిస్టు అనిపించుకోదలచుకున్నవారికి స్వర్గీయ జి. కె. రెడ్డి పాత్రికేయ జీవితం ఆదర్శప్రాయం. మొదటి వర్ధంతి సందర్భంలో ఆ స్వర్గవాసికి నివాళులర్పిస్తున్నాను.

## జి. ఎన్. రెడ్డి

(4వ పేజీ తరువాయి)

ప్రచురించడమేకాకుండ; తననేతృత్వంలో, తనపర్యవేక్షణలో ఆధునిక సాహిత్యంలో సమాజానికి ఉపకరించే వివిధ ప్రక్రియలపై విద్యార్థులచే పరిశోధనలు చేయించి, కొంగ్రొత్త పరిశోధనా కార్యక్రమాలను ప్రోత్సహించిన విజ్ఞులు. ఎందరో పరిశోధక విద్యార్థులకు గుప్తంగా ఆర్థిక సహాయంకూడాచేసిన ఆర్ద్రహృదయులు.

అయిదేళ్ళపాటు బ్రౌన్ ప్రాజెక్టును నిర్వహించి తెలుగు భాషాసాహిత్యాలకు సి. పి. బ్రౌన్ చేసిన అపూర్వ సేవలకు గుర్తింపుగా, కొన్ని బ్రౌన్ గ్రంథాలను తన సంపాదకత్వాన వెలువరించారు.

జాతీయసమైక్యతకు, భావసమైక్యతకు దోహదంచేసే అనేక స్వతంత్రవ్యాసాలను ఆంధ్ర, ఆంగ్ల భాషలలో వ్రాసి ప్రచురించారు. అనేక ప్రామాణిక గ్రంథాలకు అపురూపమైన పీఠికలు సంతరించారు. అనేక ఉత్తమ గ్రంథాలను సమీక్షించారు.

ఇవి అన్నీ ఒకఎత్తు. ఆయన నిఘంటు నిర్మాణ కృషి ఒకఎత్తు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన తెలుగు-తెలుగు నిఘంటువు; యు. జి. సి. ధన సహాయంతో ప్రచురింపబడిన ఆంగ్ల-ఆంధ్ర ద్విభాషా నిఘంటువు; సాహిత్య అకాడమీవారికై కూర్చిన మాండలిక వృత్తిపదకోశాలు; నాటువైద్య నిఘంటువు; సమానార్థకపద నిఘంటువు; రాయలసీమ స్థలనామాల నిఘంటువు మొదలైనవి ఆయన నిఘంటు నిర్మాణ దక్షతకు, పాండితీ పటిమకు, ప్రజ్ఞా పాటవాలకు నిదర్శనాలు.

పారిభాషా [illegible], పాఠ్యాంశ నిర్ణయ సంఘాధ్యక్షులుగా, విశ్వవిద్యాలయ కళాశాల అధ్యాపక సంఘ ప్రథమాధ్యక్షులుగా, అనుబంధ కళాశాలల అభివృద్ధి సంఘాధ్యక్షులుగా, సిండికేట్ సభ్యులుగా, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యనిర్వాహక సంఘ సభ్యులుగా, కేంద్ర సాహిత్య అకాడమీ జనరల్ కౌన్సిల్ సభ్యులుగా, విశ్వవిద్యాలయ ఉపకులపతిగా; చేపట్టిన వివిధ పదవీ బాధ్యతలను అత్యంత సమర్థతతో, వినా ఎవరినీ నొప్పించక నిర్వహించగలగడం వారి పరిపాలనా ప్రావీణ్యానికి తార్కాణం.

జి. ఎన్. రెడ్డిగారు 1984లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవీబాధ్యతలు స్వీకరించి మూడేండ్లు ఎన్ని ఒడిదుడుకులెదురైనా సహనంతో, దక్షతతో ఆత్మగౌరవానికేమాత్రం భంగం కలుగనిరీతిలో అరాజకీయంగా నిర్వహించారు.

అధ్యాపనారంగంలో ఆయన సేవలకు గుర్తింపుగా విశ్వవిద్యాలయ స్థాయి అధ్యాపకుల్లో ఉత్తమ అధ్యాపక బహూకృతిని 1981లో ప్రభుత్వం ప్రసాదించింది.

తన ఆదర్శప్రవర్తనతో తెలుగుభాషా సాహిత్యాలకు ఎనలేని సేవచేసిన ఆయన జూలైతో రిటైరైనాడు.

విద్యారంగంలో ఆయన సృష్టించిన మానవీయమైన విలువలు అందరికీ ఆదర్శాలు. విశ్వవిద్యాలయాలలో తెలుగు బోధనను, పరిశోధనను ప్రభావితంచేసి శాస్త్రీయ ప్రాతిపదికమీద ఆధునీకరించిన విద్యావేత్త డాక్టర్ జి. యన్. రెడ్డి. ★

## సింహపురి

(4వ పేజీ తరువాయి)

పోలీస్ స్టేషన్, ఆర్. డి. ఓ., ఎం. ఆర్. ఓ., ఆర్ అండ్ బి, సబ్ ట్రెజరీ ఆఫీసులు వున్నాయి. ఈ అఫీసుల్లో పనుల కోసం ప్రతిదినం అసంఖ్యాకంగా జనం వచ్చిపోతుంటారు. అయితే వారికి త్రాగడానికి మంచినీళ్ళుకూడా దొరకవక్కడ. పెన్షన్లకోసంవచ్చే వృద్ధులైతే ఈ దప్పిక బాధకు తట్టుకోలేకపోతున్నారు. ఆఫీసుల సిబ్బందికూడ మంచినీళ్ళకోసం తహతహలాడుతుంటారు. ఈ నీటిసమస్య గురించి ఆర్. డి.ఓ.కు విన్నవించుకున్నా కొళాయి వేయించలేదట. ఇప్పుడైనా ఆర్. డి. ఓ. గారు మునిసిపల్ అధికారులకు చెప్పి తాలూకా ఆఫీసు ఆవరణలో కొళాయి వేయించాలని అందరి కోరిక.

### సకాలంలో ఇవ్వని స్కాలర్‌షిప్‌లెందుకు?

విద్యార్థులకు ప్రభుత్వం ప్రకటించిన తెలుగు విజ్ఞాన పారితోషికాలను నెల్లూరు డి. ఇ. ఓ. విడుదల చేయడంలేదట. మార్చి నెలాఖరుకు ఇవ్వవలసిన రెన్యూవల్ స్కాలర్‌షిప్‌లుకూడా ఇంతవరకు యివ్వలేదట. ఇంకోనెల గడిస్తే అవి పనికిరావట, సకాలంలో యివ్వని స్కాలర్‌షిప్ లెందుకని ప్రశ్నిస్తున్నారు నెల్లూరు విద్యార్థులు. డి. ఇ. ఓ. గారూ, ఎందుకింత అలస్యం?

## రైతులోకం

(4వ పేజీ తరువాయి)

ప్రయోజనకారి క్రిములుకూడా లేకపోవుట వలన నష్టం అధికమగును. మందువల్లిన పొలంలో ప్రయోజనకారి క్రిములు వుండుటవలన, కొన్నిపురుగులు ప్రక్క పొలంలోకి (అంటే మందు ప్రభావం లేని పొలంలోకి) పోవుటవలన సస్యరక్షణ తీసుకొన్న పైరుకన్నా తీసుకొనని పొలం కొంతవరకు మెరుగుగా కనిపిస్తుంది.

పైనచెప్పిన వస్థాలవలన రైతులందరూ ఒకప్రాంతములో ఒకేపైరు వేసినప్పుడు సస్యరక్షణచర్యలు అందరూ ఒకే దఫా పాటించడం అవసరం. ఏ తెగులుకు ఏమందు వాడాలో మండలంలో వున్న వ్యవసాయ నిపుణులద్వారా తెలుసుకొని రైతులందరూ సమష్టిగా సస్యరక్షణ చర్యలు పాటిస్తే అధికదిగుబడులను పొందవచ్చును. ★

## శివారెడ్డి పద్యాలు

### ఆగస్టు 15

అట్టె కళ్ళుజూచి ఆగస్టు పదిహేను
వైభవాన్ని కాంగి ప్రాభవాన్ని
[illegible] జిల్ల మూలమూలనున్న
తెలుసుగాంగి, తప్పతెలియదన్న!

కలుసుకొనిరి తిరిగి కాంగ్రేసు వారంత
ఏకమైరి యింక భేదలేదు
కాంగిరేసు గెలుపు ఖాయమ్ము, ఏమందు
నేద్రుమల్లి! నీదు నేర్పు చూడ్పు!

### ఆంధ్రజ్యోతి

చదివినాను నీదు సంపాదకీయాన్ని
ఆంధ్రజ్యోతి! నాకు అర్థమైంది
ఇంది పెండియన్సు యీ ప్రజాస్వామ్యమ్ము
ఇండియాకు దాచపుండు, నిజము!

అడిగె దిక్కులేదు ఆడిందిఆటైంది
ఎక్కువైంది త్రాగుడేదబట్ట
మంచిసెర్తి మట్టుమర్యాదలనలేం
కొరత అవసరమ్ము కొద్దిరైము!

### వరలక్ష్మీవ్రతం

26 తేది శుక్రవారం వరలక్ష్మీ వ్రతం, [illegible]

### ముహూర్తములు

21 తేది ఆదివారం ఉదయం 4-20 గంటలకు మరియు ఉదయం 11-04 గంటలకు వివాహ, ఉపనయన, వ్యాపార ప్రారంభములకు మంచిది.

25 తేది గురువారం ఉదయం 10-50 గంటలకు తులలగ్నము మరియు రాత్రి 12-16 గంటలకు వృషభ లగ్నములు ఉపనయన వ్యాపార ప్రారంభ, శంకుస్థాపన, వివాహ, గృహప్రవేశ లగ్నములు.

### ఆగస్టు తిథులు

| | | | |
|---|---|---|---|
| 20 | శని | అష్టమి | రా. 3-50 గం.వ |
| 21 | ఆది | నవమి | రా. 3-24 ,, |
| 22 | సోమ | దశమి | రా. 2-34 ,, |
| 23 | మంగళ | ఏకాదశి | రా. 1-14 ,, |
| 24 | బుధ | ద్వాదశి | రా. 1-29 ,, |
| 25 | గురు | త్రయోదశి | రా. 9-38 ,, |
| 26 | శుక్ర | చతుర్దశి | రా. 7-18 ,, |

—స్వయంపాకుల శ్రీనివాసులు ఎం. ఎ.







'నువ్వే నా శ్రీమతి' లో శ్రీదేవి

# పింగళి పదాలన్నీ సినిమా పేర్లయిపోతున్నాయి!

సినిమా సాహిత్యంలో మల్లెపందిళ్లు వేసిన పింగళి నాగేంద్రరావు ఏ స్వర్గాన ఉన్నారోగాని, ఆయన విజయాపిక్చర్స్‌వారికి రాసిన పాటల్లోని పదాల "పాపం పసివాడు" (పాతాళ భైరవి), ఎంతఘాటు ప్రేమయో, (పాతాళ భైరవి), "అహనా పెళ్ళంట" (మాయా బజార్), "వివాహ భోజనంబు" (మాయా బజార్), "చూపులు కలిసిన శుభవేళ" (మాయాబజార్), "సాహసం సేయరా డింభకా" (పాతాళ భైరవి) దర్శకులు జంధ్యాల, రేలంగి నరసింహారావు తమ చిత్రాలకు టైటిల్స్‌గా పెట్టుకున్నారు. జంధ్యాల దర్శకత్వం వహించే మహాలక్ష్మీ ప్రొడక్షన్స్‌వారి చిత్రంపేరు "హై హై నాయకా" (ఇదికూడా పింగళి సృష్టే). ఈ చిత్రంలో నరేష్ హీరో.

### కళాసాగర్ అవార్డ్స్

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సమితి 'కళాసాగర్' 14 వ వార్షికోత్సవ సందర్భంగా ఆగస్ట్ 15 స్వాతంత్ర్య దినోత్సవంనాడు ప్రకటించిన గ్రహీతలు; ఉత్తమచిత్రం: ఈతరం పిక్చర్స్ 'ప్రజాస్వామ్యం', ప్రత్యేక ప్రశంస: 'కులాల కురుక్షేత్రం' (శ్రీ దత్త సచ్చిదానంద ఫిలిమ్స్), ఉత్తమ దర్శకుడు: జంధ్యాల (పడమటి సంధ్యారాగం), హిట్‌చిత్రాల నిర్మాత: భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్: ఎస్. గోపాల్‌రెడ్డి. ఉత్తమనటుడు: చిరంజీవి (పసివాడి ప్రాణం), ప్రత్యేక ప్రశంస: డాక్టర్ రాజశేఖరరెడ్డి (ఆహుతి), ఉత్తమ నటి: విజయశాంతి (స్వయంకృషి), ప్రత్యేక ప్రశంస: సుమలత (శ్రుతిలయలు), ఉత్తమ కేరెక్టర్ యాక్టర్: రావుగోపాలరావు (ఇంటిదొంగ), ఉత్తమ కేరెక్టర్ యాక్ట్రెస్: జయసుధ: (ఆత్మ బంధువులు), హాస్యనటుడు: నూతన్ ప్రసాద్ (చందమామరావే), ప్రత్యేక ప్రశంస: బ్రహ్మానందం (అహనా పెళ్ళంట), హాస్యనటి: శ్రీలక్ష్మి (మన్మథ లీల-కామరాజుగోల), కథారచయిత: దాసరి నారాయణరావు (మంజు), సంభాషణల కర్త: ఎం. వి. ఎస్. హరనాథరావు (కులాల కురుక్షేత్రం); గేయకర్త: జాలాది (ఇదా ప్రపంచం), గాయకుడు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం (మంజు), ప్రత్యేక ప్రశంస: శ్రీనివాస్ (ప్రజాస్వామ్యం), గాయని: పి. సుశీల (శ్రుతిలయలు), సంగీత దర్శకుడు: ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం (పడమటిసంధ్యారాగం), ఛాయాగ్రాహకుడు: దివాకర్ (పడమటి సంధ్యా రాగం).

జాతీయస్థాయిలో ఉత్తమనటుడుగా ఎన్నికైన కమలహాసన్‌ను, ఉత్తమనటిగా ఎన్నికైన అర్చననుగూడా ఈ సందర్భంలో సన్మానించటం ముదావహం. మద్రాసు

**మద్రాసు సినిమా వార్తలు**

సమీపాన విల్లివాకంవద్ద ఓ పాఠశాల 'కళాసాగర్' ఆధ్వర్యంలో మెరుగులు దిద్దుకొంటూంది. ఇందునిమిత్తం నిరుడు ఐదులక్షలు వసూలుచేసినట్లే ఈ ఏడాది కూడా మరో ఐదులక్షలు ఖర్చు పెట్టడానికి నిశ్చయించినట్లు కళాసాగర్ అధ్యక్షులు ఎం. ఎస్. రెడ్డి తెలిపారు.

### దాసరి రాజకీయరంగ ప్రవేశం

ప్రముఖ దర్శకరచయిత, పత్రికాసంపాదకుడు, జమీందారైతు రామానాయుడు అవార్డు గ్రహీత కళాప్రపూర్ణ దాసరి నారాయణరావు 100-వ చిత్రం విజయమాధవి ఫిలిమ్స్ వారిది. ఇందులో ఆయన దర్శకత్వంలో రాలిపోరిగా చిరంజీవి నటించటం విశేషం. వంద చిత్రాలు పూర్తి చేశాక ఆయనపేరు 'గిన్నిస్‌బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' లోకి ఎక్కనున్నది. ఈ సందర్భంగా మద్రాసులోని తెలుగు ఫిలిమ్ జర్నలిస్టుల సంఘం ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసింది. నటించటానికి ఈసినిమా రంగానికి వచ్చి రచయితనయ్యాను. ఆ తర్వాత ఈ పరిశ్రమ నన్ను దర్శకుడిగా చేసింది. పదిహేను సంవత్సరాల కాలంలో నేను వందచిత్రాలు డైరెక్ట్ చేశానంటే— నేనింతటిస్థితికి ఎదగడానికి నటులు, సాంకేతిక నిపుణులు, పాత్రికేయులు, ప్రేక్షకులు కారకులు. వారి ఆశీస్సులులేనిదే నేడు నేను ఒక పత్రికా సంపాదకుడ్ని అయి ఉండేవాణ్ని కూడా కాదు. ఈ పత్రికారంగంలో కూడా ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసి వస్తోంది. న్యూస్‌ప్రింట్ ధర పాపంలా పెరిగిపోతోంది. కొంతకాలం పోయాక దినపత్రిక సైతం సామాన్య మానవుడికి

—కొరవ 11 వ పేజీలో

# వాణిశ్రీ మళ్లీ పుట్టింది!

ఆగస్ట్ 3 న కాంతారావు సమర్పించే "స్వాతి చినుకులు" షూటింగ్‌లో వాణిశ్రీ జన్మదినోత్సవం ఘనంగా జరుపబడింది. ఆమె కట్ చేసిన కేకుమీద ఒకే ఒక్క కొవ్వొత్తి ఉంది. అదేమిటని అడిగితే,

**చిత్రరంగ ప్రవేశ చిహ్నంగా ఒకేఒక కొవ్వొత్తితో జరిగిన పుట్టినరోజు పండుగ**

"పెడిగా మళ్ళీ పుట్టిన తర్వాత జరిగిన తొలి పుట్టినరోజు ఇదేకదా?" అంది నవ్వుతూ. "స్వాతి చినుకులు" కథను సమకూర్చింది వాణిశ్రీయే. ఆ చిత్రంలో అక్కా చెల్లెళ్ళుగా ద్విపాత్రలు నిర్వహించమని కాంతారావు కోరగా "పిక్చరంతా నేనే కనిపిస్తూంటే, బోర్‌కొట్టి పోతుంది. చెల్లెలు పాత్రను జయసుధ చేత వేయించండి. చాలా బావుంటుంది." అని సూచించింది వాణిశ్రీ! ఈమె త్వరలోనే అక్కినేని నాగేశ్వరరావు పక్కన నటించవచ్చు కూడా.

ఇప్పటి తారలు వాణిశ్రీ నుంచి నటన విషయంలోనేకాక, సెట్ కు సకాలానికి రావటం, షూటింగ్‌లో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవటంలాంటి ఎన్నో విషయాలు నేర్చుకోవాలి. చక్కని కథ, అందులో ఉదాత్తమైన పాత్ర ఉంటేగాని ఆమె నటించటానికి అంగీకరించదు గనుక ఆమె నటించే చిత్రాలు ఉత్తమ కోవకు చెంది తీరుతాయని విశ్వసించవచ్చు.

### జయప్రద స్వంత చిత్రంలో కృష్ణ

జయప్రద తన తమ్ముళ్ళకు ఓ దారి కల్పించాలని రాంకుమార్, రాజబాబులతో తొగట 'రాకీ' తీసింది. ఆ చిత్రం కాస్తా

—కొరవ 11వ పేజీలో

# మనందరి కళ్ళు తెరిపించే గుడ్డి చిత్రం

## కళ్ళు

చిత్రసమీక్ష
గిద్దలూరు గోపాలరావు

నీతి నియమాలు పట్టించుకోని మనిషి గుడ్డివాడు. అన్యాయాన్ని అరికట్టలేని వ్యక్తి గుడ్డివాడు. తోటిమనిషి బాధను గుర్తించలేని మానవుడు గుడ్డివాడు. మానవతను పెంచలేని దర యిద గుడ్డివాడు. హింసను ప్రోత్సహించే కసాయి గుడ్డివాడు. దేవుణ్ణి చూడలేని పూజారి గుడ్డివాడు. ఇలా కళ్ళున్న గుడ్డివాళ్ళు ఎన్నోరకాలు. అసలు కళ్ళు లేని గుడ్డివాళ్ళు మరోరకం. కళ్ళులేనివారి గుడ్డితనం బాధాకరం. కళ్ళున్నవారి గుడ్డితనం భయంకరం. ఈ బాధాకర విషయాన్ని, ఈ భయంకరరూపాన్ని కనువరుస్తూ శక్తి పిలింసువారు "కళ్ళు" చిత్రం నిర్మించారు.

ఇప్పుడు మంచినటుడుగా సినిమా రంగంలో రాణిస్తున్న గొల్లపూడి మారుతీరావు సుమారు రెండు దశాబ్దాల క్రితం వ్రాసిన "కళ్ళు" అనే నాటికను ఆధారంగా తీసుకొని డి. విజయకుమార్ అదేపేరుతో చిత్రం నిర్మించారు. ఈ నాటిక రంగస్థలం మీద ఎంతో పేరుసంపాదించింది. ఎన్నో బహుమతుల నందుకుంది.

ఆనాడు "కళ్ళు" నాటికను చూసి స్పందించిన ప్రముఖ ఛాయాగ్రాహకుడు యం. వి. రఘు ఈనాడు ఆ నాటికకు వెండితెరరూపాన్ని కల్పించారు. ఈచిత్రానికి చిత్రానువాదం, ఛాయాగ్రహణం, దర్శకత్వం బాధ్యతలు రఘు నిర్వహించారు. మేటి ఛాయాగ్రాహకుడుగా పేరు గడించిన రఘు తొలిప్రయత్నంలోనే గట్టి దర్శకుడనిపించుకున్నారు.

గుడ్డివాడైన రంగడు, సీతాలు మరి ముగ్గురు గుడ్డివాళ్ళతో ఒక పాడుబడ్డ దేవాలయంలో సహజీవనం సాగిస్తుంటారు. సీతాలు పువ్వులు అమ్మి డబ్బుసంపాదిస్తూ వుంటుంది. మిగతావారు రోడ్లమీద పాటలు పాడుకూడబ్బుసంపాదిస్తుంటారు. ఆ దేవాలయం పూజారి, అన్నం అమ్ముకునే వర్తకుడు ఈ గుడ్డివాళ్ళను మోసంచేసి డబ్బు దోచుకుంటూ వుంటారు. స్నేహలత అనే జర్నలిస్టు సహకారంతో రంగడికి చూపు తెప్పించేందుకు ఆపరేషన్ చెయ్యిస్తారు మిగతా గుడ్డివాళ్ళు. రంగడికి కళ్ళు రావటంతో అతనిధోరణి మారిపోతుంది. సంఘవిద్రోహశక్తులతో చేతులుకలిపి అన్యాయాలకు పాల్పడుతాడు. తల్లిగా, చెల్లిగా భావించిన సీతాలును మానభంగం చేసేందుకు పూనుకుంటాడు. తమకు అండగావుండి వెలుగుమార్గం చూపుతాడని రంగడికి కళ్ళుతెప్పించిన మిగతాగుడ్డివాళ్ళు చీకటిమార్గంలోపడి దుర్మార్గాలు చేస్తున్న రంగడికళ్ళను పొడిచి రంగణ్ణి మళ్ళీ గుడ్డివాడిని చేస్తారు.

కథాంశం చాలాస్వల్పం. ఈ చిన్న అంశానికి నేటి సామాజికజీవితంలో జరిగే అన్యాయాలను కొన్నిటిని జోడించి కథ నిడివిని పెంచాడు దర్శకుడు. నేటి కలుషిత రాజకీయవాతావరణం కొంత స్మగ్లింగు పగ, ప్రతీకారంతో కూడిన హత్యలను, రాజకీయ పలుకుబడికి అమ్ముడుపోయిన పోలీసు వ్యవస్థను, ఎప్పుడూ గుడ్డివాళ్ళనే చూచి విసుగెత్తినవారికి కాస్తంత హుషారు కోసం అర్ధనగ్నపు క్లబ్ నృత్యాలను జోడించాడు దర్శకుడు.

కళ్ళను గురించి చిత్రం ప్రారంభంలో వివరించిన తొలిపలుకు, దానికి పోలికగా చూపిన దృశ్యాలు గొప్పగావున్నాయి.

గుడ్డివాళ్ళ పాత్రలను చాలాసహజంగా రూపుదిద్దాడు దర్శకుడు. ఒక మంచి ఆశయంవైపు నడిపించాడు. కళ్ళు లేక పోయినా కళ్ళున్నవాళ్ళకంటే ఎంతో తెలివిగా కేవలం స్పర్శజ్ఞానంతో పరిచయమున్న వ్యక్తులను, వస్తువులను గుర్తుపట్ట గల శక్తిసామర్థ్యాలను ప్రశంసనీయంగా చూపాడు.

కళ్ళు వచ్చినతర్వాత ఇతర గుడ్డివాళ్ళున్న దేవాలయం దగ్గరకు రంగణ్ణి వెళ్ళమని చెప్తుంది స్నేహలత. రంగడు బయలు దేరుతాడు. తనకు కళ్ళువున్నా ఆ దేవాలయం వద్దకు వెళ్ళలేకపోతాడు. ఆదేవాలయానికి ఎలావెళ్ళాలో చెప్పమని దారిన వెళ్ళేవాళ్ళను అడుగుతాడు. వారూ చెప్పలేరు. అప్పుడు రంగడు తన రెండుకళ్ళూ మూసుకుని గుడ్డివాడిలా తన పాతధోరణిని అనుసరిస్తాడు. కాలిస్పర్శతో, చేతిస్పర్శతో నేరుగా దేవాలయంవద్దకు వెళతాడు. ఈ దృశ్యం దర్శకుని మంచి భావనాశక్తికి నిదర్శనం. అలాగే రంగడు, సీతాలును మానభంగం చెయ్యబోవటం, కళ్ళున్న గుడ్డివాళ్ళుచేసే దుర్మార్గాన్ని సహించలేని మిగతా గుడ్డివాళ్ళు, రంగడి కళ్ళను చేతివేళ్ళతో పొడిచి మరలా వాడిని గుడ్డివాడిని చెయ్యటం ఈ దృశ్యాలు పతాకస్థాయి నందుకున్నాయి.

కళ్ళుండీ, కళ్ళులేని గుడ్డివాడుగానటిస్తూ మోసంతో డబ్బుసంపాదించే మరోపాత్ర గూడా చక్కగాతీర్చిదిద్దబడింది. ఈపాత్ర వల్ల కొంత హాస్యసృష్టిగూడా జరిగింది.

అంతా కొత్త నటీనటులతో, గుడ్డివాళ్ళను ముఖ్యపాత్రల్లో వుంచి చిత్రం తియ్యటం నిజంగా సాహసమే. సాహసోపేతమైన ఈ కార్యంలో రఘు విజయం సాధించాడు.

నటీనటులంతా చాలాగొప్పగా నటించారు. హరనాథ్ మాటలు పదునుగా వున్నాయి. ★

---

## సినిమా

(9వ పేజీ తరువాయి)

అందుబాటులో ఉంటాదేమో! వందచిత్రాలు పూర్తి చేశాక నా భవిష్యత్తు కార్యక్రమాల గురించి తెలియజేస్తాను. సమయం వచ్చినప్పుడు నా రాజకీయరంగ ప్రవేశం గురించి వెల్లడిజేస్తాను అని ఆ సందర్భంలో దాసరి నారాయణరావు చెప్పారు.

### కోదండరామ రెడ్డి దర్శకత్వంలో ఎ.ఎన్.ఆర్., నాగార్జున

కలెక్టరుగారి అబ్బాయి, అగ్నిపుత్రుడు చిత్రాలతర్వాత నెల్లూరీయుడు ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం వహించే ఎస్. ఎస్. క్రియేషన్స్‌వారి చిత్రంలో ఎ. ఎన్. ఆర్, నాగార్జున మూడవసారి కలిసి నటించనున్నారు.

వచ్చే ఏడాది చిరంజీవి, బాలకృష్ణ, నాగార్జున నటించే మూడు చిత్రాలను రెడ్డి డైరెక్ట్ చెయబోతున్నారు. ఈయన, చిరంజీవి కాంబినేషన్‌లో ఇంతవరకు 24 చిత్రాలు తయారయ్యాయి. ఈయన శక్తి వంచన లేకుండా కృషి చేస్తారు గనుకనే నిర్మాతలకు ధోకా ఉండదు.

### పోటీ నిర్మాత

పేరు ఏదయితేనేం.అతనో నిర్మాత. ఇతనికి స్వతహాగా ఆలోచించేంతటి తెలివితేటలు లేవు. ఇతర నిర్మాతలు ఏది చేస్తే, అది పోటీగా చేస్తుంటాడు. వాణిశ్రీని కాంతారావు నటింపచేస్తున్నాడని తెలిసి ఈ పోటీనిర్మాత ఎగాయెకిన బెంగుళూరు వెళ్లాడట కృష్ణకుమారిని బుక్ చేయడానికి. తీరా ఆమెను చూశాక తెల్లబోయాడట. ఇంత కాలంగా ఎక్కడో దూరంగా స్థిరపడిఉన్న నన్ను బుక్ చేయడానికొచ్చిన నువ్వు నిజంగా నిర్మాతవేనా? ఇప్పుడు నన్ను జనం ఎవరైనా చూస్తారా? అని చక్కా టీవాట్లు పెట్టి, పంపించేసిందట ఆమె. ★

---



---

## జయప్రద చిత్రం

(9 వ పేజీ తరువాయి)

టుప్ మంది. తీయబోయే కొత్త చిత్రానికి కాస్త తెలివితేటలు ఉపయోగించింది. ఈ చిత్రంలో కృష్ణను హీరోగా బుక్ చేసుకుంది. తనతోపాటు తన చిన్నతమ్ముడు శ్రీరాంకుమార్ కూడా ఉంటాడు. సీత, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు. ప్రతీపశక్తి ఇతర పాత్రలను పోషిస్తారు. "గిరఫ్తార్" హిందీ చిత్రం ఆధారంగా తయారయ్యే ఈ చిత్రానికి ... పినిశెట్టి డైరెక్టరు. ★

---



---

### ప్రకటన

మా కక్షిదారుడు ప్రస్తుతం పశ్చిమ గోదావరిజిల్లా ద్వారకా తిరుమల గ్రామం కాపురస్తుడు వర్ధకాల వెంకటరాఘవాచార్యులగారి కుమారుడు వెంకటభాష్యం అయ్యంగారు 4-9-1986వ తేదీన తన అన్న రంగరామానుజాచార్యులు, వదిన వేదవల్లి,లక్ష్మీనాథాచార్యులుకలిసి ప్రకాశం జిల్లా సింగరాయకొండ మండలంలోని పాకల గ్రామ కాపురస్తుడు ఉలిచి లక్ష్మా రెడ్డి కుమారుడు ఉలిచి కోటిరెడ్డికి వ్రాయించి యిచ్చిన జనరల్ పవర్ ఆఫ్ అటార్నీని ఇందుమూలముగా రద్దు చేసుకొనుచున్నారు:

ఎ. వి. దుర్గాప్రసాద్
అడ్వొకేటు-కావలి 534 202

---

### కావలి డి॥ ము॥ కోర్టులో

**O. S. No. 629/87**

గుంపర్ల వెంకటసుబ్బారావు —వాది
యస్. కె. జహర్‌బి వగైరా—ప్రతివాదులు

**To.**

2 వ ప్రతివాది : అరిగెల శ్రీనివాసులు S/O రామమోహనరావు APSRTC బస్‌డ్రైవర్, కావలి.

సదరు దావా మీ హాజరు నిమిత్తం తే 31—8—88 దిన పగలు 10-30 గంటలకు వాయిదా వేయడమైనది. మీరు హాజరుకానియెడల మీ పరోక్షమున తీర్మానించబడును.

—వంటేరు రమణారెడ్డి, అడ్వకేటు.

---

### ప్రకటన

నెల్లూరుటౌన్, రాంనగర్, దర్గామిట్ట కాపురస్తురాలు లేట్ సి. ప్రతాప్‌సింగ్‌గారి భార్య కోకిలాబాయి అను నేను యావన్మందికి తెలియజేయునది ఏమనగా.

నాకు నిడుగుంటపాళెం గ్రామములో సర్వే నెం. 582 లో య 5.00 ట్లు మెట్ట భూమి కలదు. సదరు భూమిని గవర్నమెంటు వారు 1970 వ సంవత్సరములో 'D' Form పట్టా ఇచ్చివున్నారు. సదరు భూమి నా స్వాధీనానుభవములో అప్పటి నుంచి వుంటూయున్నది. సదరు భూమిపై ఇతరులు ఎవ్వరికి ఎలాంటి హక్కులేదు.

నా బావగారైనటువంటి సి. కుబేర్‌సింగ్ అనువారు సదరు భూమికి తానే యజమాని నని చెప్పుకుంటూ మోసపూరితముగా అమ్మజూపుతున్నట్లు తెలియవచ్చినది. సదరు కుబేర్‌సింగ్ గారికి ఆ భూమి పై ఎలాంటి హక్కులున్నూ లేవు. సదరు భూమిని ఎవరైనా సదరు కుబేర్‌సింగ్ గారి వద్దనుంచి కొన్నయెడల వారికి ఎలాంటి హక్కులున్నూ సంక్రమించవు అని ఇందు మూలముగా యావన్మందికి తెలియజేయుడమైనది.

ఇట్లు,
సి. కోకిలాబాయి

---



---

### In the Court of the Subordinate Judge, Nandyal

**S. C. 69/87**

యం. ఇస్మాయిల్‌ఖాన్ -వాది
బి. దేవభూషణం -ప్రతివాది

పై దావాలో ప్రతివాదిపైన 1876/- రూపాయలు రాబట్టుకొనుటకు వాది దావా దాఖలు చేసియున్నారు. ప్రతివాదికి చాలా పర్యాయములు కోర్టుద్వారా సమన్లు జారి చేసినప్పటికీ తీసుకొనక తప్పించుకొని తిరుగుచున్నారు. కావున ఆఖరిగా ప్రతివాది హాజరు అగుటకు 19-9-88 తేది యందు వాయిదా వేసియున్నారు. కావున ఆ దినము ఉదయం 10-30 గంటలకు పై కోర్టువారి ఎదుట హాజరు కావలయును లేకున్న పరోక్షముగా పై దావాను తీర్మానించెదరు.

నంద్యాల -యం. సంజీవరెడ్డి
11-8-88 వాది అడ్వొకేటు

---

### కావలి సబ్ కోర్టులో

**S. C. No. 2/88**

Chinni Srinivasa Rao -Plaintiff
Vs.
Somavarapu Ashokkumar Reddy -Defendent

- దావా నోటీసు -

ఈ నెంబరున వాది మీ పైన దాఖలుచేసి యున్నందుకు మీకు నోటీసు నిమిత్తం 6-9-88 తేది వాయిదా వేయబడివున్నది. గనుక యిందువిషయమై మీకుగల ఆక్షేపణలు ఆరోజు పగలు 10 గం॥కు కోర్టులో మీరు హాజరయి తెలుపుకోవలెను లేని యెడల మీ పరోక్షమందు యక్సుపార్టీగా తీర్మానించబడును.

-పి. నాగ సుబ్రహ్మణ్యేశ్వరరావు,
-వాది తరపు అడ్వకేటు.

---



మేమంటే ఎంతో అభిమానం, ఆదరణ చూపించి
నిరంతరం మా హృదయాంతరాలలో నిల్చిపోయిన
మా ఇలవేల్పు మా అవ్వ

# మాగుంట కృష్ణమ్మగారి

## ఆరవ వర్ధంతి

### 23-8-88 తేది మంగళవారం

నెల్లూరులో జరుగును.
ఆమె పవిత్రాత్మకు భగవంతుడు
శాంతిని చేకూర్చమని ప్రార్థిస్తూ-

మాగుంట సుబ్బరామరెడ్డి మరియు సోదరులు
**సిద్దవరపు మధుసూదనరెడ్డి**

# ●● శ్రద్ధాంజలి



మా బ్యాంకు అభివృద్ధికి, మా శ్రేయస్సుకు
అహర్నిశలు పాటుపడిన మా అప్తులు
పూజ్యులు అయిన మా బ్యాంకు అధ్యక్షులు

# శ్రీ అరిగెల సుబ్బరామయ్యగారు

**6-8-88** తేది మమ్ములను
దుఃఖసాగరములో ముంచి స్వర్గస్తులయినారు.

వారి మరణానికి శోకతప్త హృదయాలతో
శ్రద్ధాంజలి ఘటిస్తూ, వారి ఆశయాలను సదా
మననం చేసుకుంటూ, వారులేని లోటును బ్యాంకుకు
రానీయక, మా విధ్యుక్తధర్మాన్ని నెరవేరుస్తామని
ప్రతినచేస్తూ, వారి మరణంపట్ల అరుణాంజలి ఘటిస్తూ
వారి కుటుంబసభ్యులకు మా సానుభూతిని అందజేస్తున్నాము.

సిబ్బంది
**నెల్లూరు కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు**

యం. శేషగిరిరావు   పి. సుబ్రహ్మణ్యం   కె. సూర్యనారాయణ   జి. రాధాకృష్ణయ్య
పి. యానాదయ్య   వి. హనుమంతరావు   యం. జయశీల   డి. గోపాలకృష్ణమూర్తి
యస్. విజయకుమార్   ముంతాజ్ బేగం   రమణమూర్తి   ఉమాకాంతారావు
పి. వెంకయ్య   కేశవరావ్   అజయ్‌కుమార్   శ్రీహరి   చెంచయ్య

Edited, Printed & Published by N. DolendraPrasad at the Zamin Ryot Press, Nellore-524001